# వినయ విజ్ఞాపనం

మొవ్వ వృషాద్రిపతి
ఆంధ్రోపన్యాసకులు - రేపల్లె

అతిలోకోత్తర ప్రజ్ఞాప్రాభవం - నిత్య శాస్త్ర సాహిత్యాధ్యయన సముపార్జిత పాండితీ శౌండీర్యం - అనుస్యూత చిత్రవిచిత్ర కమనీయ లోకప్రవృత్త పరిశీలన గ్రాహ్య విజ్ఞాన విన్యాసం సంగమించిన త్రివేణీ సంగమం "విద్వత్క విశేఖర-పండిత" శ్రీ యార్లగడ్డ వెంకట సుబ్బారావు గారి శేముషీ పాటవ వైభవం పారావార గాంభీర్యం-మహోత్తుంగ మేరు పర్వత శృంగౌన్నత్యం-హీరధారా నైశిత్యం-వినిర్మల చంద్ర చంద్రికా శీతలత్వం- సుధామల్లికా ధవళ దరహాస పరిమళత్వం కలసి రూపుదాల్చిన దివ్యరూపం శ్రీ సుబ్బారావు గారి కమనీయ కవితా విలాసం

అచ్చ తెలుగు వేషంతో-మందార మకరంద సదృశ మధురభాషణంతో చిరునవ్వులు చిందిస్తూ-అందరినీ అలరిస్తూ- స్నేహానికి స్పందిస్తూ చరించే శ్రీ సుబ్బారావు గారు మానవతా ప్రతీక - మమతా పతాక అరితేరిన మహా పండితుడనీ, కవితా కళాస్వరూపమనీ ఆయనను గురించి నిన్న మొన్నటిదాకా ఎవ్వరికీ తెలియదు ఒక నిస్వార్థ రాజకీయవేత్తగా, మృదుభాషిగా, స్వచ్ఛ శీల సంపన్నునిగా మాత్రం తెలుసు

సాహితీ లోకంలో నిరపవాద ధ్వని సిద్ధాంతం ప్రతిపాదించి ఆచంద్రార్క దిగంతయశోవిశాల సముజ్జ్వల దేహుడైన ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతాన్ని గురించి పరిశోధనలు సలిపిన శ్రీ సుబ్బారావు గారు, నాల్గు దశాబ్దాలుగా తననే దిక్కని నమ్మిన సారస్వత సంపర్కం విడనాడి, తనను నమ్మని రాజకీయాంగనతో ధర్మ విహితగృహస్థం నిర్వహించాలని తపించారు విరుద్ధ ధర్మాల పొత్తు ఎలా కొనసాగుతుంది?

సప్తతి వసంతాల యువ కవితా వసంతహేల యిది శ్రీనాథుని "ప్రౌఢ నిర్భర వయః పరిపాకాన్ని కూడా దాటిందేమో! మంత్రి పదవి విడిచి జన్నం చేసి సోమయాజియై ఆంధ్రావళి మోదముం బొరయ శ్రీమదాంధ్ర మహాభారతం పదునైదు పర్వాలు ఒక్కచేతిమీద అనువదించిన కవిబ్రహ్మ వయస్సునకటో-యిటో కాని శ్రీ యార్లగడ్డ వారు యజ్ఞం- యాగం ఇలాంటి

వేమీ నిర్వహించలేదు నేరుగా కవితా యజ్ఞం కొనసాగించారు కావ్యరసపానహ విర్భాగానికి బుధసంతతి అంతా చేతులు చాచేలా నిర్వహించారు

ఇది "కాకతీయ తరంగిణి" కాదు 'మధుర కవితా తరంగిణి' 'కాకతీయ కల్లోలిని' 'కాకతీయ శైవాలిని' అని కాకుండా ఈ పేరు పెట్టటంలో కవిగారు వ్యంగ్యం పాటించారు. 'తరంగం' అంటే దరిజేరునది అని అర్థం రసహృదయుడైన పాఠకుని దరిజేరునది అని అంతరార్థం కాగా - పాఠకునకు బ్రహ్మానంద సహోదర రససామ్రాజ్యం సమీపంలోనికి తెచ్చేదని పిండితార్థం

వీరు సంప్రదాయ బద్ధులు ఆ విషయం ప్రత్యక్షరంలో ప్రస్ఫుటం అర్థం పర్థంలేని నియమ నిబంధనలను త్రోసిరాజనగల సర్వతంత్ర స్వతంత్రులు సామాన్యంగా సంప్రదాయ కవులు శ్రీకారంలో కావ్య ప్రారంభం చేస్తారు చేయాలనేది కూడా లాక్షణిక నిర్దేశం ఈయన

*"రా రండోయి కుమారులార! వితతాంధ్రశ్రీయశః కౌముదీ*
*నీరంధ్రంబగు నోరుగల్పురము వర్ణింపంగ శక్యంబె? వి*
*న్నారా? కాకతి రాజ వంశ పదవిన్యాసాభిరామంబుఁ గ*
*న్నారం జూతమురండు"*

అని ఆంధ్రజాతి నాహ్వానిస్తూ కావ్యం ప్రారంభం చేశారు 'ర' కార మగ్నిబీజం అగ్ని క్షాత్ర చిహ్నం నా కావ్యం వీరరసప్రధానమని ధ్వని ఇంకో 'ర' కారం రజస్సంకేతం రజోగుణం జగత్సృష్టికి మూలం దాని పరిపోషణకు సత్త్వం ముఖ్యం కావ్య సృష్టి జగత్తునకు ప్రతిసృష్టి దానికన్న ఉత్కృష్టం నా కావ్యం సృష్టికి వంకలు దిద్దిన మనోజ్ఞ సృష్టి అని ధ్వని ఓరుగల్పురము- కాకతి రాజవంశ పద విన్యాసాభిరామత్వాన్ని దర్శించటానికి రమ్మని కవి ఆహ్వానం పలుకుతున్నాడు అంతకు ముందు "ఓరుగల్పురము వర్ణింపంగ శక్యంబె?" అన్నారు అంటే నాకు వర్ణించి చెప్పటానికి సాధ్యం కాదు కనుక కన్నార చూపిస్తాను రమ్మని స్వాగతం పలికారు అంటే నాకావ్యం వర్ణచిత్రం చదివినప్పుడు కలిగే అనుభూతి కాక, సాక్షాత్తు చూచినప్పటి ఆనందం కలిగిస్తానని గట్టిగా చెప్పారు అది మనకు విన్పించిందో లేదో అని 'విన్నారా?' అని మనలను దర్శింపచేస్తానంటున్నారు కవి ఇక్కడ 'ద్రష్ట' యైన కవి 'దార్శనికునిగా' దర్శనమిస్తున్నారు "రారండోయి-విన్నారా!" వంటి ప్రయోగాలు నాటకీయ రచనా సంవిధానాలు ఇంత శిల్పం ఒక్క పద్యంలో ప్రదర్శించటం మహాకవులకే సాధ్యం

చారిత్రకేతివృత్తం తీసికొని కావ్యరచనకు పూనుకోవటం చాలీ చాలని దుప్పటి కప్పుకోవటం మొగం నిండా కప్పుకొంటే కాళ్లు బయట ఉంటాయి కాళ్లకు కప్పుకొంటే ముఖం బయట పడుతుంది కేవలం చరిత్రాత్మక సంఘటనలు వ్రాసుకొంటూపోతే సాహితీపరులీసడిస్తారు స్వకపోల కల్పనలతో తీర్చిదిద్దితే చరిత్రకారులు తప్పుపడతారు ఇరువాగుల వారికి ఆమోదయోగ్యమైన మార్గాన్ని అనుసంధించటం-అసిధారావ్రతం అందులో సుబ్బారావు గారు ఉత్తమ తరగతిలో ఉత్తీర్ణులని వేరే చెప్పాలా?

మూర్తిని చిత్రించేపట్ల వివిధ పద్ధతులలో కవులు తమ నైపుణ్యాన్ని నిరూపించుకొన్నారు కేవల వేషబాషాకృతులను రంగుల కుంచెతో చిత్రించినట్లు కొందరు తీర్చిదిద్దారు ఆంతర భావ ప్రపంచ వర్ణనంతో భౌతికరూప ప్రదర్శన చేశారు మహాకవులు ఆ మార్గంలో తిక్కనతో సమానుడాంధ్ర సాహితీ ప్రపంచంలో నభూతో నభవిష్యతి ద్రౌపదీ పరాభవ దర్శన దందహ్యమానుడైన భీముని, భీమ స్వరూపాన్ని "నేలయు నింగియు" అనే పద్యంలో మహాభయానకంగా భూమ్యాకాశాలు ఆక్రమించిన విరాడ్రూపంగా చిత్రీకరించారు

ఈ కావ్యంలో కవి ఒక క్రొంగ్రొత్త ప్రయోగం చేశారు ఇది తెలుగు సాహిత్య లోకంలో మున్ను విన్నది కాదు కన్నది కూడా కాదు భీమ చోడుడు తమ్ముడైన గోకర్ణుని సంహరించాడు 'అదుపు నాజ్ఞయు తప్పిన మదపు టేన్గు' వలె ప్రజలను పీడించాడు అది విని కాకతి రుద్రదేవుడు స్వయంగా ఆతనిపై దండెత్తాడు భీముడు రుద్రపరోక్షంలో ఎన్నివాగినా, కాకతీయ బలాలను చూచి ఆర్తిచెందాడు భయంతో తల్లడిల్లాడు

"కాకతీంద్రుఁడు ఘోర ఖడ్గాంచలంబునఁ
దనయుత్తమాంగమ్ముఁ దఱిగినట్లు
గళనాళముం బట్టి కంఠదఘ్నంబుగాఁ
గోష్ఠ రక్తము నక్క గ్రోలినట్లు
కాకగృధ్రంబులు కండలింతింతగాఁ
జించి యాపోవ భక్షించినట్లు
పుంద్రేక్షుఖండంబుఁబోలెఁ గోలెమ్ము కఁ
దెమలిచి శునకమ్ము నమలినట్లు
కన్నులంగట్టి నట్లైనఁ గంపమడర

ముచ్చెమట గ్రమ్మి నిలువున ముంచియెత్త
గజగజవడంకి తడబడి కాళ్లు పెనగగ
భీమచోడుని నాలుక పిడుచగట్టె"

ఈ పద్యంలో అమిత భీతితో ప్రాణాలరచేత పట్టుకొని పారిపోయే నీచుని రూపాన్ని వర్ణించారు కవి పారకుని హృదయంపై ఈ రూపం తిష్ఠ వేస్తుంది ఈ పద్యమొకసారి చూడండి పూర్వార్థం అంటే సీసమంతా భీతమానసిక ప్రవృత్తి వర్ణించింది ఎత్తుగీత ఉత్తరార్థం ఆ మానసిక ప్రవృత్తికి స్పందించిన భౌతిక స్వరూపంలోని చేష్టలన్నీ స్పష్టం చేసింది మొత్తం భీమచోడుని కంపించే దేహం - ఆతని హృదయంలో కదులుతున్న భావాలు రెండూ ఒకేసారి భావుక ఫలకం మీద దర్శనమిచ్చి అఖండానందం కలిగిస్తాయి ఈ విధమైన రూప చిత్రణం నాన్యతోదర్శనీయం

అటువంటి నీచుడు శుద్ధాంతాన్నీ - బంధుమిత్రాదులను అప్పటికే అసువులు వీడిపడియున్న అయ్యపీనుగును, పడవాళ్లను పట్టించుకోకుండా బ్రతికుంటే బలుసాకు ఏరుకొని తినవచ్చునని ఎవ్వరికీ చెప్పకుండా పారిపోతాడు ఈ సన్నివేశం పారకున కాతని మీదజుగుప్సను-హేళనభావాన్నీ ఏహ్యభావాన్నీ కలిగించాలి కాని "తనతోడిదే లోకమని నమ్మికొలిచెడి" అనే పద్యం పారకుని అశ్రుజలాన్ని చప్పరిస్తుంది జ్ఞానసాధనకోసం భార్యను - వృద్ధుడైన తండ్రినీ - రాజ్యాన్ని - అప్పుడే జన్మించిన పుత్ర సంతానాన్ని విడిచి వెళ్ళిన బుద్ధుని నిష్క్రమణ సమయంలో పారకుడు చెందిన భావావేశం విషాదానుభూతిని కవి యిక్కడ కల్పించారు ఇది కరుణకు అస్థానపతితంకాదా అని ప్రశ్న కాదు అని సద్యస్సమాధానం అన్నెం పున్నెం ఎరుగని అతని శుద్ధాంతకాంతామణులు- అతనిని నమ్మి సేవించే బంధు హితవ్రాతం, ఆతని వల్ల కలిగిన ఆందోళనతో అసువులు వీడిన తండ్రి శవం, శ్రమించి ప్రాణాలకు తెగించి యుద్ధ సన్నద్ధులైన సైనికులు కవి సానుభూతికి పాత్రములయ్యారు వారిని గురించే కవి వేదన - ఆవేదన భీముడు పారిపోయిన చింత కవికేమాత్రం లేదు దానిని విస్మరింపజేయటం కవి ఆశయం ఇదే కవిత కౌచిత్యం ఇది జీవగట్టు ఇలాంటి సన్నివేశాలలో కవి క్రాంతదర్శిగా సాక్షాత్కరించారు

కావ్యం వ్యవహార నిర్ణయం చెయ్యాలి సామాజిక స్పృహ కవికి అనివార్య లక్షణం పద్య కవులకు సామాజిక స్పృహ ఉండదని లోకంలో ఒక అపప్రధ మహాకవులు పద్యకవులైనా - పద్యేతర కవులైనా నేల విడిచి సాము చెయ్యరు

నేడు భారతదేశం కుల మతాల రొచ్చులో కుత్తుకబంటిగా కూరుకొనిపోయి 'పంకనిర్మగ్నధర్మగవి' చందంగా అల్లాడుతున్నది. ఎందుకు బాధపడిన కవి ఏమని ఘోషిస్తున్నారో ఆలకించండి

"కులములం దెచ్చు లొచ్చులు పలుచఁబడిన
నంతకంటె మతోన్మాద మదుపుదప్పి
ధాత్రి మానవ కోష్ణ రక్తస్రవంతి
జలకమాడించి పుచ్చె మచ్చరము రెచ్చె

మతము పేరఁ దొరఁగు మానవరుధిరంబు
బలిమిఁ గ్రోలలేని భారతాంబ
గర్భగోళమెంత గగ్గోలు వెట్టినఁ
దలఁకఁబోరుధర్మ తత్త్వవిదులు"

ఈ పద్యాలలో కవి ఆందోళన, ఆవేదన, ఆవేశం మేరమీరి ఉప్పరానికి ఎగుస్తున్నది. తిక్కన వీరశైవ వీరవైష్ణవ విబేదాలను తొలగించటానికి హరిహరనాథ తత్త్వం ప్రబోధించినట్లు - శ్రీ సుబ్బారావు గారు కుల మతరహిత సమాజ స్థాపన కావాలని తమరచనలో ధ్వనింపజేశారు

వాల్మీకి మహాకవి ఏ సుముహూర్తంలో శ్రీమద్రామాయణ మహాకావ్యంలో జన్మభూమి స్వర్గంకన్నా మిన్న అని ఘోషించాడో అప్పటి నుండి మహాకవులందరు దేశభక్తి ప్రబోధం చేస్తూనే వచ్చారు వస్తున్నారు ఈయన దేశభక్తిని కొన్ని పద్యాలలో చాటించిన తీరు ప్రశంసాపాత్రం ప్రాతస్స్మరణీయం

నన్నయ శ్రీనాథాది మహాకవితల్లజులు తమ కావ్యాలలో ఏదో ఒకవిధంగా స్థానం కల్పించుకొని ఆంధ్రదేశ సౌందర్య స్వరూపాలను తనివితీర వర్ణించుకొని మురిసిపోయారు అదే మార్గదర్శకత్వం గ్రహించి శ్రీ సుబ్బారావు గారు గణపతి దేవుని తీర్థయాత్ర నాధారం చేసికొని ఆంధ్రదేశాన్ని ఆపాతమధురంగా స్వతోరమ్యంగా అభివర్ణించారు బౌద్ధ చైత్యాలు, నాగార్జునుని కొండ, కృష్ణవేణి-విజయవాడ-గుంటూరు-పలనాడు-అమరావతి- శ్రీకాకుళం మొదలైన ప్రాంతాలను తనివితీర వర్ణించుకొని సంతృప్తి చెందారు పాఠకునికసంతృప్తి రగిలించారు ఈ కవి యీవిధంగా ఆంధ్రదేశ వర్ణనమే యితివృత్తంగా వ్రాస్తే ఎంత మధురమనోజ్ఞ భావనాపరంపర వెలువడునో చూడాలనే ఆకాంక్ష పాఠకునకు తప్పకుండా కలుగుతుంది

ప్రస్తుతం రాజులు లేరు రాజ్యాలు లేవు ప్రజా ప్రభుత్వాలతో కాలక్షేపం చేస్తున్నాం రాచరికపుటలవాటులు గానీ, ఆచారాలు గానీ మనకు కాలగర్భ రహస్యాలు పూర్వకవులు రాజనీతిని గురించి వ్రాశారంటే అది వారి సమకాలీన వ్యవస్థ క్షైత్రపాలుడు యజ్ఞదత్తునితో తన ఓటమిని గురించి వివరిస్తాడు అపుడాతనికి యజ్ఞదత్తుడు రాజనీతి నుపదేశిస్తాడు

*"స్వామ్యమాత్య సుహృత్కోశ సహిత రాష్ట్ర*

*దుర్గబలములు గల ఱేఁడు దుర్జయుండు"* వంటి పద్యాలు చదువుతుంటే కౌటిల్యుని రాజనీతిని చదివిన అనుభూతి కలుగుతుంది అందుకేగా *'రవి కాననిచో కవి గాంచునే కదా!'* అన్నారు

పిన్నచోదుని ఇద్దరు కుమార్తెలను గణపతి దేవుడు పెండ్లిచేసికొన్నాడు వారమ పేరమలత్తింటికి వెళుతున్నారు అపుడు వారి తల్లి వారిద్దరికి చెప్పే బుద్ధులు తెలుగువారి గుండె నుండి జాలువారిన ఆర్ద్రి బాష్ప ప్రవాహాలు

*"అనుఁగుఁ గూఁతులార! అల్లారుముద్దుగాఁ*

*గన్నదానఁ బెంచుకొన్నదాన"* అని ప్రారంభించటంలో ఒక ఆదు-దనం కనిపిస్తుంది మాతృహృదయం కన్నుల కదుతుంది ఇక్కడి ప్రతివాక్యం, జీవన ప్రవాహం నుండి పిండిన సారంగారసప్రపూతమైంది

కథ చెప్పే నేర్పు కవికి పుష్కలం మరోభారతం వంటి పల్నాటి వీర చరిత్ర కొలది పద్యాలలో దిక్ప్రదర్శనంగా చూపించటం కవిప్రతిభకెత్తిన కేతనం అవసరమైనచోట కథాకథనశైలి-అందులో పలుకుబడులు-సామెతలు-జాతీయాలు కోకొల్లలుగా నడిపించారు

వీరికి సంస్కృత భాషా పాండిత్యం నిరుపమానం తెలుగు పద్యరచన - సంస్కృత శ్లోకరచన ఏదైనాసరే వీరికి నల్లేరుమీద బండినడక కాకతీయ విభుడు శ్రీగిరిని సందర్శించి శ్రీశైలనాథుని పూజించిన సందర్భంలో వీరు రచించిన సంస్కృత శ్లోకాలు-ఏ ప్రౌఢ సంస్కృత పూర్వకవుల శ్లోకాలకు తీసిపోని విధంగా భావబంధురంగా ధారాశుద్ధితో గంధసింధురాలులాగా మత్తగమనంతో సాగిపోయాయి

ఆధ్యాత్మిక జ్ఞానం ఒంటపట్టించుకొన్న నిష్కామయోగి శ్రీ సుబ్బారావు గారు ఈ కావ్యంలో ఎడనెడతాత్త్వికునిగా దర్శనమిస్తారు పాఠకుని తత్త్వచింతనా నిమగ్నునికావిస్తారు

"పురుషకారమునకుఁ బూర్వసంస్కారంబు
సహకరించెనేని సత్ఫలంబు
విషమమయ్యెనేని విపరీత ఫలమబ్బు
కర్మధర్మ సూక్ష్మమర్మమిదియె"

ఒక నిగూఢతత్త్వ భావ మెంత సూక్ష్మ సుందరంగా విశదీకరించారో చూడండి

వీరు వేదవేదాంగాలు నఖ శిఖ పర్యంతం గండూషించి విడిచినవారు అందుకే ప్రకృతిలో వేదాత్మను దర్శిస్తారు

"కాల స్వమాట్లు మొగసాలగంట పగిది
వేద పాఠంబునకుఁ బూను విప్రుభంగి
టెక్కలల్లార్చి మెడనిట్టనిక్కఁజాఁచి
కొక్కొరోకో యనుచుఁ గూసెఁ గోడిపుంజు"

ఇలాంటి వర్ణన లెన్నింటినో పాఠకులు తిలకిస్తారు

ఈ కావ్యంలో శబ్దాలంకారాలు అర్థాలంకారాలు తామరంతంపరగా పదు గుపేకలా అల్లిబిల్లిగా అల్లుకొని పోయాయి అప్రయత్నసిద్ధంగా జాలువారే అలంకారాలే ఆనందదాయకాలు ఆమోదయోగ్యాలు

"అన్నరేంద్రు పేరు విన్నంతఁ దలవంచె
బుసలుకొట్టు నృపతి భోగికులము"

ఇందలి శ్లేషాలంకార మెంత ఆపాతకమనీయమో వేరుగా వివరింపనక్కరలేదు

"హృదయమున్నమనుజుఁ గదలించు ఘటనలు
చట్టుబొమ్మ కేమి చక్కలిగిలి" వంటి వెన్నో ఈ కవితల్లజుడు వాడిన సామెతలు లోకోక్తులు-జాతీయాలు- నుడికారాలు-పదబంధాలు లెక్కకుమిక్కుటాలు వానిని ఉటంకించ పూనుకొంటే కొండవీటి చాంతాడు పొడవు తగ్గుతుంది

అన్నివిధాలా ప్రాచీన మహాకవుల ప్రబంధాలతో నీవా-నేనా అన్న స్పర్థతో ఈ కావ్యం జబ్బచరచి బరిమీద నిలుస్తుంది శబ్దాధికారం-అర్థాధికారం-సమాసనిర్మాణ దక్షత-పదబంధచాతుర్యం-ఛందోలంకారాదిశాస్త్ర విద్యా పాండిత్యం శ్రీ సుబ్బారావు గారి కవితాశ్రీకి పెట్టనికోటలు విడిచిన బాణంలా-గట్టులొరసికొని

ప్రవహించే మందాకినిలా-వీరిపద్యం దూసికొనిపోతుంది అర్థం-శబ్దం పోటీ బడి గోదాలోకి దిగుతాయి వీరు తెనుగుదనం పోషించినా-సంస్కృతం పోషించినా అది అనితర సాధ్యంగానే సాగుతుంది

శ్రీ యార్లగడ్డ వేంకట సుబ్బారావు గారు నాకు గురుస్థానీయులు వయస్సులో గాని-పాండిత్యంలో గాని- అనుభవంలో గాని-శక్తిలో గాని వారితో ఏవిధంగాను పోలనని నాకు తెలుసు నాయందున్న వాత్సల్యంతో నాలుగు వాక్యాలు వ్రాయవలసిందన్నారు కాదు ఆదేశించారు కాదనే ధైర్యం లేక శిరసావహించాను ఈ కావ్యానికి ఇతరుల కితాబు సుతరామూ అవసరం లేదు దీనికి ముందుమాటలు వ్రాయటమంటే సముద్రానికేతమెత్తటం సాహితీ లోకానికి శ్రీ సుబ్బారావు గారిని పరిచయం చేయటమంటే మధ్యందినమార్తాం డుని దివ్వెతో చూపించటం మరి తెలిసీ ఎందుకు చేశావీ పని అని ఎవ్వరైనా అడుగుతారని నాకు తెలుసు వయస్సు ప్రక్క నుంచి, సాహితీ లోకంలో నేను బాలుణ్ణి తప్పటడుగులు వేస్తున్నవాడిని బాలునకు వాపిలం ఎక్కువ బాలుర చాపల్యం పెద్దలకానంద హేతువౌతుందని నమ్మి యీ సాహసం చేశాను

చివరిమాట ఈ 'కాకతీయ తరంగిణి' అమృత సాగరం ప్రతి తరంగ మొక మధురసనిర్ఝరి ప్రతి పద్య మొక సుధాశీకరం

ఇంతటి శక్తి సంపన్నుడైన ఈ కవి యింతకాలం ఒక్క కావ్యం కూడా వ్రాయకపోవటం కవితావధూటి పట్ల మహాపచారం తన్నివారణార్థం కార్య రంగంలో దూకి దీక్షతో ఈ కావ్య పరిశిష్టభాగాన్ని పూర్తిగావించి ఇంకా ఒకటి రెండు రసవత్కావ్యాలు సృష్టించి తెలుగుచైతలపొలాన్ని సస్యశ్యామలం చెయ్యాలని వినయంతో విన్నవిస్తున్నాను ఈయన గారి కావ్యంలోని పద్యమేమనవి చేస్తాను

> "కవిచతురాననుల్ కడఁగి గంటముఁ బట్టకయున్న విశ్వస్వ
> ద్భువన విలాసమేయణఁగిపోయి నశించును కాలగర్భమం
> దవిదిత పూర్వమానుషమహాచరితంబగు జాతి యున్నతి
> ప్రవణముగాదు జంతుతతిభంగి నజస్రముఁ బుట్టి గిట్టెడున్"

ఈ విషయం తెలిసికూడా యింతకాలం తాను గంటం పట్టక పోవటానికి కారణం? మీరూ అడగండి అడిగితే వడ్డీతో కూడా చెల్లిస్తారేమో!

రేపల్లె
భావ-హేమంతం

బుధజన పాదరేణువు
మొవ్వ వృషాద్రిపతి

# సమీక్ష

మన పూర్వులు సారస్వతాన్ని శాస్త్రసారస్వతం, కావ్య సారస్వతం అని రెండుగా విభజించారు శాస్త్ర సారస్వతం విజ్ఞానదాయకమైతే కావ్య సారస్వతం ఆనందదాయకమౌతుంది కావ్య సారస్వతానికే సాహిత్యమని మఱొక పేరు సాహిత్యం రసపర్యవసాయి అది ఒక కళ ఆ కళ కవి ప్రతిభకు ప్రతిబింబం ప్రతిభ జన్మసిద్ధమైనది నేర్చుకొంటే వచ్చేదికాదు అందువలననే 'కవి జన్మిస్తాడు' అని అనుభవజ్ఞులంటారు

'కవిర్మనీషీ, పరిభూః స్వయంభూః,' అని ఈశావాస్యోపనిషత్తు కవీ, పరమేశ్వరుడూ తమంతట తామే జన్మిస్తారు అని దీనిభావం "అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః" అని ఆనందవర్ధనుడు అనంతమైన కావ్య ప్రపంచానికి కవియే సృష్టికర్త అని దీనిభావం ఈ కవిబ్రహ్మ వ్రాసే కవిత్వం ఛందస్సుందరమైన పద్యంలో ఉంటే మఱింతగా రాణిస్తుందని ఆలంకారికుల అభిప్రాయం పాశ్చాత్యులలో కూడా చాలమందికి ఇదే అభిప్రాయం ఉన్నది

తెలుగు పద్యం వెయ్యేండ్లకు మించిన జీవితాన్ని సంతరించుకొని, ఎన్నెన్నో క్రొత్తపుంతలు త్రొక్కి నిత్యనూతనంగా భాసిస్తూ అజరామరకీర్తి నందుకొన్నది కాని రెండు దశాబ్దాల నుండి వచన కవిత్వం విజృంభించి పద్యకవిత్వాన్ని తెఱమఱుగుకు పంపే ప్రయత్నం చేస్తున్నది పద్యాన్ని వృద్ధప్రక్రియగా భావించే యువ పాఠకలోకం ఎక్కువయింది ప్రతిభావ్యుత్పత్తులు గల పద్యకవులు కొఱవడటమో, సాహితీ సంపన్నమైన పాఠకలోకం మఱుగుపడటమో దీనికి కారణం కావచ్చును అయినా అప్పుడప్పుడూ ఎడారులలో జలాశయాల వలె పద్యకవులు తెరపైకి వస్తూనే ఉన్నారు 1994లో "కాకతీయ తరంగిణి" అనే చారిత్రక పద్య కావ్యాన్ని రచించిన శ్రీ యార్లగడ్డ వెంకట సుబ్బారావు గారు వీరిలో ఒకరు

శ్రీ సుబ్బారావు గారు తర్క-వ్యాకరణ-మీమాంసాది శాస్త్రాలను గాఢాభినివేశంతో అధ్యయనం చేశారు సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాలలో పట్టాభిషిక్తులయ్యారు సాహిత్య ప్రక్రియలలో ఏకదేశాలైన "గృహరాజసౌధం" వంటి సాహితీ రూపకాలను ప్రదర్శనయోగ్యంగా ప్రజ్ఞా విశేషంతో రచించారు రాజకీయంగా పరిపాలనారంగంలోనూ, రైతుబిడ్డగా వ్యవసాయ రంగంలోనూ

నాధులు దీనిపై దండెత్తి పోదామని సూచించారు దానికి రుద్రదేవుడు స్పందించి

"పల్లె నాడాల గోడును బాలగోడు
నైన తటినెత్తిపోవుట్ధర్మంబుగాదు
చిచ్చు దరికొన్నయదనున ముచ్చిలింత
పాలసుఁడు దక్కమెచ్చఁడు ప్రాజ్ఞుఁడెవఁడు" అని అన్నాడు

ఈ గీతంలో రుద్రదేవుని పాత్ర అద్భుతంగా పోషింపబడ్డది

కావ్యానికి కథ శరీరమైతే పాత్ర పోషణ ప్రాణము వంటిది

కవి తాను కన్పించకుండా పాత్రలద్వారా తన భావాలను వెల్లడిస్తూ స్తోత్రపాత్రుడౌతాడు శత్రువులు కష్టాలతో సతమతమవుతున్నపుడు సమయం చూచి దండెత్తి పోవటం రాజనీతి దానిని కూట నీతిగా రుద్రదేవుని ద్వారా చెప్పించి నిరసించటంలో కవికున్న ధర్మాధర్మ విచక్షణ, ఆర్ద్ర హృదయం ఆవిష్కృతం ఔతున్నాయి "చిచ్చుదరికొన్న యదనునముచ్చిలింత" అనేపాదం పద్యానికీ, రుద్రదేవుని పాత్రకూ ప్రాణప్రతిష్ఠ చేసింది

## బసవేశ్వరుఁడు

నామ సామ్యాన్ని విశ్లేషించి చమత్కారంగా చెప్పటం కూడా కవిత్వానికి క్రొత్త సొగసులు తెచ్చిపెడుతుంది బసవేశ్వరుని వర్ణిస్తూ కవిపోయిన పోకడలు చూడండి

"కాలు దట్టి చెలఁగి కర్ణాటహొయసల
రాజ్యసీమ లదర ఱంకెలిడుచు
విశ్రమింప కడరి వీరశైవగురుండు
బసవఁడెల్లదెసలఁబర్వులెత్తె"

బసవేశ్వరుడు అంటె వృషభాధిపతి అనే అర్థం కూడా ఉన్నది కదా, కాలుదట్టి చెలగటం, ఱంకెలిడటం, పరువులెత్తటం వృషభ ధర్మమూ వీరధర్మం కూడా అవుతుంది ఉభయ ధర్మాలకూ తగిన పదజాలాన్ని ప్రయోగించి పాఠకులను గిలిగింతలు పెట్టడం ఈ పద్యంలోని సొగసు

ఇలాంటిదే ఇంకొక పద్యం శైవ గురుడు గణపతి దేవుని అనునయిస్తూ

చెప్పినది

"కాలమొక్క రీతిఁగడవ దెవ్వారికి
రాజు కొలువ బంటు రాజ్యమేలు
విష్ణునంతవాఁడె వేసమ్ములను మార్చు
తిరిపె మెత్తు దేవదేవుఁడైన"

విష్ణువుకు అవతారాలెత్తటం, శివునకు తిరిపెమెత్తటం సహజ ధర్మాలు ఈ సహజ ధర్మాలను గణపతి దేవునికి వచ్చిన ఆపద్ధర్మాలతో పోలుస్తూ శైవగురువు అనునయించిన తీరు పాఠకులకు "ఆహా" అనిపిస్తున్నది ఇలాగే కాలచక్ర పరిభ్రమణంలో క్రిందుమీదూ, మీదు క్రిందూ ఐనట్లే సేవకుడురాజుగా రాజు సేవకుఁడుగా పరివర్తనం పొందటం సహజమని పర్యాయ పరిణామాన్ని బోధిస్తూ ఈ పద్యం కాలప్రభావాన్ని అద్భుతంగా వివరించింది పెద్దపెద్ద విషయాలను చిన్నచిన్న పద్యాలలో కమ్మని తెలుగు నుడికారంతో చెప్పటం కవిగారి కవితా విశిష్టతను నిరూపిస్తున్నది

## శరదృతువర్ణన

చతుర్థ తరంగంలోని శరదృతు వర్ణన ఆ ఋతువులాగే సహజ సుందరంగా సాగింది

"వినయ లజ్జా విధేయలౌ వెలఁదు లట్లు
నదులు ననుకూలవర్తన నొదిగి సాగె
పరిహృతాఘమౌ సాధు జీవనము కరణి
జీవనము తేటుకొని శౌచసిద్ధిఁ గాంచె"

మొదటి రెండు పాదాలలో స్త్రీలకూ నదులకూ పోలిక స్త్రీల విషయంలో అనుకూల వర్తన అంటే భర్తల కనుగుణంగా నడచుకొనటం నదుల విషయంలో కూలమును (ఒడ్డును) అతిక్రమింపకుండా అనుసరించి ప్రవహించటం రెండవ భాగంలో సాధుజీవనానికీ, నదీ జలానికీ శుచిత్వంలో పోలిక సాధువుల జీవనం నిర్మలంగా ఉంటుంది శరదృతువులో నదీజలాలు నిర్మలంగా ఉంటాయి అనుకూల వర్తన, జీవనము, శౌచము అనే పదాలు శ్లేషార్థంతో ఈ పద్యానికి ప్రాణం పోశాయి నది పరంగా శరదృతు ధర్మాలను వర్ణించటం మనోజ్ఞంగా ఉన్నది



ఇంకొక పద్యం చూడండి

"పూర్ణిమా చంద్రమోబింబ మోహనాస్య
తారకానిర్నిమేషసుందరతరాక్షి
తఱపి వెన్నెల ముసుంగునందనరురాత్రి
యొప్పె వలిపము దాల్చిన యునిద వోలె"

శారద రాత్రిని యువతిగా పోల్చి పున్నమనాటి నిండు జాబిల్లిని ఆమె ముఖం గానూ, తారకలను సుందర తరాక్షులుగానూ వెన్నెలను వలిపపు ముసుగుగాను వర్ణించారు ఈ పద్యాన్ని చదువగానే నన్నయ గారి శారద రాత్రులుజ్జ్వలలసత్తర తారక హారపంక్తులన్"అనే పద్యం జ్ఞాపకం వస్తుంది ఆయన తారకలను రాత్రికి హారపంక్తులుగా వర్ణించాడు రాత్రి శబ్దం సంస్కృత భాషలో స్త్రీలింగం కాబట్టి లింగ సామ్యంతో రాత్రిని స్త్రీమూర్తిగా వ్యంగ్య విధానంతో ఊహించుకోవాలి సుబ్బారావు గారు తారకలను నిర్నిమేషసుందర తరాక్షులుగా వర్ణించాడు తారకలు అంటే కన్నులు అని అర్థమున్నది తారకలు (చుక్కలు) రాత్రి సమయమంతా ప్రకాశిస్తూనే ఉంటాయి ఇక నేత్రాలో మూస్తే ప్రకాశింపవు అంద వలన నిర్నిమేష సుందర తరాక్షులు" అన్నాడు రెప్పలార్పని అందమైన కన్నులే చుక్కల లాగా నిరంతరంగా ప్రకాశిస్తాయి అని భావం ఇచ్చట నిర్నిమేష అనే విశేషణం ఎంతో సార్థకం సంపాదించుకొన్నది ఇంకొక విశేషమేమంటే నన్నయ తారకలను హారాలుగా పోలిస్తే సుబ్బారావు గారు తారకలను తారకలతోనే పోల్చారు తారకలకు తారకలే సాటి అన్యంబులు కావు అనే అనన్వయత్వం కూడా సిద్ధిస్తుంది ఎంతో వ్యుత్పన్నత గల కవులకే ఇలా చెప్పటం సాధ్యమవుతుంది తారకలతో పోల్చడంతో ఇంకొక విశేషమేమిటంటే నేత్రాలు గూడా తెల్లగానే ఉన్నాయని చెప్పటానికి పెద్దన్నగారు మనుచరిత్రలో తదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచున్" అని వరూధినీ వీక్షణాలను తెల్లగానే వర్ణించాడు ప్రకరణానుసారంగా నిర్నిమేషసుందరతరాక్షులు గూడా తెల్లగానే ఉండాలి మోహనాస్య, సుందరతరాక్షులు, ఉవిద అనే ప్రద ప్రయోగాల వలన ఈ శారదరాత్రి నవయౌవనస్ఫూర్తితో ప్రకాశించే ముగ్ధమనోహరమూర్తిగా పాఠకుల హృదయాలను దోచుకొంటున్నది

## శ్రీశైల దేవుని వర్ణన

రుద్రదేవుడు చందవోలు గొంకరాజును జయించి విజయోత్సాహంతో శ్రీశై

లస్వామిని దర్శించటానికి వెళ్లి ఆ స్వామిని ఎనిమిది సంస్కృత శ్లోకాలతో వర్ణించాడు ఈ వర్ణన కవికి సంస్కృత సాహిత్యంలో ఉన్న ఉన్నతాధికారాన్ని స్పష్టం చేస్తున్నది స్తుతించినవాడు రుద్రదేవ మహారాజు స్తుతింపబడ్డవాడు రుద్రుడగుటచే ఉభయ తారకంగా రుద్రాష్టకం అని పేరు పెట్టటం భావ్యంగా ఉంటుంది ఒకటి రెండు శ్లోకాలు పరికించుదాం

1 "మహేశ్వరోఽ సిత్వమ హాం మహీశో
గిరీశ్వర స్త్వం నగరీశ్వరోఽహమ్
ఆవాముభౌ రుద్రపదాభిధేయా
వుభౌచ నాగేన్ద్ర విభూతి భాజౌ।

2 సామ్యం సమీచీనమత పురారే
నిరన్తరం హ్యాన్తరమేవ మన్యే
మృత్యుఞ్జయస్త్వం గరళం ని పీయ
మర్త్యస్సుధాబ్ధావపి మజ్జితోఽహమ్ ||

1 నీవు మహేశ్వరుడవు నేను మహీశ్వరుడను నీవు గిరీశుడవు నేను నగరీశ్వరుడను ఉభయులమూ రుద్ర నామధేయులమే నాగేంద్ర విభూతి భాజులమే అన్నాడు తుది వాక్యంలో శ్లేష ఉన్నది శివపరంగా సర్పములు-బూడిద-అని అర్థం రాజుపరంగా ఏనుగులు, ఐశ్వర్యము అని అర్థం

2 ఈ విధంగా మనకు సమీప సామ్యం ఉన్నప్పటికీ అంతులేని భేదం కూడా ఉన్నది విషము మ్రింగికూడా నీవు మృత్యుంజయుడవైనావు సుధాబ్ధిలోమునిగినాకూడా నేను మర్త్యుడగానే ఉంటాను

విశేషం - రాజు సుధాబ్ధిలో మునుగుట అసంభవం ఏ పుణ్యలేశమైనా అక్కడకు వచ్చి మునుగుట జరిగినా మర్త్యుడుగానే ఉంటాడుగాని మృత్యువును జయింపలేడని తాత్పర్యం 'అపి' అనే అవ్యయ ప్రయోగం ఇంత విశేషార్థాన్ని సూచించింది సిద్ధహస్తుడైన కవికితప్ప ఇలాంటి ప్రయోగాలు చేయుటం ఇతరులకు సాధ్యంకాదు మిగిలిన శ్లోకాలు కూడా ఇలాగే రమణీయార్థ ప్రతిపాదకాలుగా ఉన్నాయి

## రాజనీతి

సుబ్బారావు గారు తన రాజకీయ రంగప్రవేశాన్ని నిరర్థకంగా భావించి బాధపడినా రాజకీయ కౌటిల్యం, లోకవృత్త పరిజ్ఞానం ఆ రాజకీయ ప్రవేశం వలన ఆయనకు అధికంగానే అవగత మయ్యాయి

రాజకీయ పరిజ్ఞానానికి ఉదాహరణగా ఈ పద్యాలు చూడండి ధరణికోట ప్రభువు కేతరాజు క్రొయ్యూరు ప్రభువగు పిన్నచోడునితో పలికిన మాటలు,

*"అంతట కేతరాజు తనయాశయముల్ వివరించెనిట్లు, భూ*
*కాంతుల రాజనీతి యధికారము వెంబడి మాఱుచుండు, న*
*ప్పింతలెఱుంగనేర రలవేలుపు టొజ్జయుఁ గావ్యుఁడైన, మే*
*ల్బంతులు గారె, యాంధ్రవరపాలకు లెల్లరుఁ గూటనీతికిన్*

*అవసరమును బట్టి యవనీంద్రులకుఁజెల్మి*
*వైరమును ఘటిల్లు, వారితలఁపు*
*లాలికైనఁ దెలియ నలవిగావెన్నఁడు*
*రాచవారి నమ్మరాదు సుమ్ము '*

ఈ పద్యాలలో రాజుల చిత్త వృత్తులు వర్ణింపబడ్డాయి వీనిని ఇప్పటి రాజకీయ నాయకుల పరంగా అన్వయించుకోవలెను పూర్వపు రాజుల స్థానంలో ఇప్పుడు రాజకీయ నాయకులున్నారు గదా పదవులకోసం పార్టీలు మార్చటం, నిన్నటి శత్రువులు నేడు మిత్రులు కావటం, ఇప్పటి మిత్రులు రేపు శత్రువులు కావటం రాజకీయ లబ్ధికోసం కూటనీతులవలంబించటం వంటి ఆధునిక కూటనీతులన్నీ ఎలా ఉంటాయో సంగ్రహంగా చెప్పారు

## ఆంధ్రుల అనైకమత్యము

తెలుగుజాతి మొదటి నుండీ ఈర్ష్యా ద్వేషాలతో క్రుళ్లి క్రుంగిపోతూనే ఉన్నది తెలుగు రాజులు పరస్పర కలహాలతో పొరుగు రాజులు దండెత్తి రావటానికి అవకాశం కల్పించారు ఈనాడు కూడా ప్రజానాయకులు పరస్పర కలహాలతో రాష్ట్ర విభజన సమయంలో తెలుగుదేశంలోని చాలా భాగాన్ని సరిహద్దు రాష్ట్రాల కప్పగించారు ఈ ఆవేదనతో కవి ఆంధ్రుల అనైకమత్యాన్ని గూర్చి వ్రాసిన పద్యాలు చూడండి

*1 "తెనుఁగునాఁడు నేఁడు తేజంబు గోల్పడె*
*వలువ చిఱఁగి గోఁచిపాఁతలయ్యె*

చిన్ననాడు లగుట చేటు మూఁడినదిట్లు
ఇరుగు పొరుగు రాజులెత్తి గదుమ

2 ఆంధ్రులం దైకమత్య మావంతలేమి
నెల్లిదంబయ్యె నితరుల కెత్తిరాఁగ
వీరుసుందోపసుందులై పెనఁగుచుంద్రు
కాని మార్తురతోఁ బోరఁగడగరైరి

3 కులము నెంచు నొకఁడు గోత్రమ్ము నొకఁడెంచుఁ
దెగల నొక్కఁ డొకఁడు దెసల నెంచుఁ
దెనుఁగుజాతి యొక్కఁడని యెంచకీ జాతి
జయము గనునె కోటి జన్మములకు

ఆనాటి రాజుల అనైకమత్యం వలన ఆంధ్రదేశంలో పొరుగు రాజులెవరెవరు ప్రవేశించటానికి ప్రయత్నించారో ఈ క్రింది పద్యాన్ని చూడండి

'అటు యాదవు లిటు పాండ్యులొ
కటఁబల్లవు లొక్కకెలనఁ, గాళింగులు నీ
చిటిపొటి నాడుల నెల్లం
గుటుకున మ్రింగెద రమృతపు గుళికల మాడ్కిన్

ఈనాడు కూడా అనైకమత్య ఫలితంగానే ఆంధ్రరాష్ట్రంలో నున్న బళ్లారి ప్రాంతం కన్నడులకూ, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలోని కొంత భాగం తమిళులకూ, పర్లాకిమిడి ప్రాంతం ఒరిస్సాకు, బస్తరు ప్రాంతం మధ్యప్రదేశ్‌కూ చెందడం మనం ప్రత్యక్షంగానే చూశాము ఈ దౌర్భాగ్యం ఆంధ్రులను పట్టి పీడించినంతకాలం జాతి అభివృద్ధి పొందలేదని కవిపడే బాధను ఈ పద్యాలు వెల్లడి చేశాయి

వస్తు ప్రధానమైన కావ్యానికి కథాకథనంలోని చాతుర్యం అందం తెస్తుంది కవి ఉపజ్ఞకు వర్ణనా నైపుణ్యం నికషోపలంగా ఉంటుంది స్వేచ్ఛగా తన మనోభావాలను ప్రదర్శించుకోటానికి వర్ణనల వంటి రంగస్థల వేదికలు కవికి మఱొకచోట లభ్యం కావు సూర్యోదయాస్తమయ వనపర్వత సముద్రాది వర్ణనలు కావ్యలక్షణాలుగా ఆలంకారికులు చెప్పటం ఈ అభిప్రాయంతోనే కావచ్చు లోకోత్తర చమత్కార వర్ణనా నైపుణ్యం కలవాడే కవి అని కవి శబ్దానికి నిర్వచనం కూడా చెప్పారు మూలకథకు వన్నె తెచ్చే సందర్భంలోనే కవి ఈ

వర్ణనలకు పూనుకొంటాడు

కాకతి మహాదేవుడు మరణించినపుడు కవిచేసిన, సూర్యాస్తమయ వర్ణన చూడండి

"తన కుదురట్లు క్రుంగ నను తాపమునంబడి యంశుమాలి, యా
ననమెఱకందిగడ్డయయినం బదిమందికి మోము చూపరా
దని యపరాంబుధీశ్వరు గృహంబునఁదాఁదల దాఁచుకొంటకో
యనఁజనెఁ బశ్చిమాచల తటాంచలభుగ్న సహస్రపాదుఁడై"

కాకతిరాజులు దుర్జయాన్వయులు దుర్జయుడు సూర్యవంశ సంభవుండని శాసనాల్లో ఉన్నది తనవంశంలో పుట్టిన మహాదేవుడు మరణించటంతో సూర్యుని ముఖం దుఃఖంతో ఎఱ్ఱకందగడ్డగా మారినదట తన విషాదవదనాన్ని లోకానికి చూపలేక ప్రతిష్ఠాకరములైన కిరణములను కుంచించుకొని, పశ్చిమాచలసానువులగుండా దిగజారి వరుణుని యిల్లైన పశ్చిమ సముద్రంలో తలదాచుకోటానికి పోయినాడని వర్ణించాడు అస్తమయ సమయంలో సూర్యకిరణాలు కుంచింకుకొనిపోవటం సహజం ఈవిషయం ఆత్మగౌరవం గల వ్యక్తి అవమానితుడైనపుడో ఆపదలపాలైనపుడో పూర్వపుటౌన్నత్యాన్ని మఱుగుపఱచుకొని ప్రవర్తిస్తాడనే లోకధర్మాన్ని ధ్వనింపజేస్తున్నది కావ్యానికి ధ్వని ప్రాణం కదా!

సహజంగా పడమటి దిశలో జరిగే అస్తమయ సమయంలో సూర్యబింబం అరుణారుణంగా ఉంటుంది ఆ అరుణత్వాన్ని ఎఱ్ఱకందగడ్డగా, అస్తమయాన్ని తలదాచుకోవటంగా సహేతుకంగా వర్ణించి చమత్కరించాడు ప్రవరుడు వరూధినీ ప్రేమను తిరస్కరించినపుడు మనుచరిత్రలో పెద్దనగారు చేసిన సూర్యాస్తమయవర్ణనను ఈ వర్ణన గుర్తుకుతెస్తున్నది

ఇలాగే సూర్యోదయ వర్ణనలో పతంగ శబ్దాన్ని శ్లేషార్థ సార్థకంగా ప్రయోగించిన తీరు చూడండి

"తూరుపుఁ గొండపై వెలుఁగు దోఁచె నిరంతర మంతరిక్షసం
చార మొనర్చు నీరధిక సారధు లాద్య పతంగజాతి సం
సారులు, బంధు మిత్రులని స్వాగత గీతము లాలపించుచుం
బాఱెఁ గులాయగర్భములఁ బాసి పతంగము లభ్రవీథులన్"

పతంగ శబ్దానికి సూర్యుడు పక్షులు మున్నగు అర్థాలున్నవి

పతంగుఁడు = వ్రాలుచున్న కిరణములు కలవాడు (సూర్యుడు)

పతంగము = ఎగురుచు వ్రాలుచు పోవునది (పక్షి)

అనూరుడు వినత కుమారుడు కాబట్టి పక్షిజాతిలో ఆద్యుడైనాడు

వ్యుత్పత్త్యర్థమును బట్టి పై ముగ్గురూ పతంగజాతివారే ప్రాతఃకాలంలో పక్షులన్నీ గూండ్లు వీడి కూజిస్తూ ఆకాశానికెగిరిపోవటం సహజం ఈ విషయాన్ని తమజాతివారైన (పతంగవాచ్యులు) సూర్యానూరులకు బంధుప్రేమతో స్వాగతం పలుకటానికై పైకెగిరి పోవుచున్నట్లు హేతువుగాని హేతువును సృష్టించి ఉత్ప్రేక్షించటం కవి వ్యుత్పన్నతకు నిదర్శనం

జాతి సామ్యంతో అనూరుడు బంధువు సూర్యునికి లోకబాంధవుడు, మిత్రుడు అనే పేర్లున్నవి కాబట్టి ఆయనకూడా బంధు మిత్రులలో చేరాడు రధిక సారధులైన సూర్యానూరులు నిరంతరాంతరిక్షసంచారులు పక్షులు కూడా అంతరిక్ష సంచారులే జాతి సామ్యంతోనే కాక వృత్తి సామ్యం కూడా ఉండటంతో పక్షులకు సూర్యానూరులు మరింత గౌరవ బాజనులైనారనే విశేషార్థం స్ఫురిస్తున్నది పతంగ, బందు, మిత్ర శబ్దాలు ఈ పద్యానికి ప్రాణప్రతిష్ఠ చేశాయి విషయ విస్తృతి చేయవలసి వచ్చినపుడు సామాన్యంగా సీసపద్యాన్నే ఎన్నుకొంటారు శ్రీనాధుని సీసాలు చూస్తే ఈ విషయం అర్థమవుతుంది "కవికీ, కంసాలికి సీసఁతేలిక" అనిలోకవ్యవహారం లోహాలన్నింటిలో సీసాన్ని కరిగించటం కంసాలికి తేలిక, సీసపద్యం వ్రాయటం కవికి తేలిక అని భావం పూర్వ మహాకవుల పద్యాలు చూస్తుంటే సీసపద్యం ఎన్నిపోకడలు పోయిందో తెలుస్తుంది సుబ్బారావు గారు శ్రీనాధుని గ్రంధాలన్నీ చదివినా కాశీఖండం ఆయనకు అభిమాన గ్రంధం అయింది సజీవమైన తెలుగు పలుకుబడులెన్నో ఆయన్ని ఆకర్షించాయి అందలి సీసపద్యాల తూగులు మరింత పరవశుణ్ణి చేశాయి ఈ కావ్యంలో మూర్తిచిత్రణ సందర్భాల్లో ఆయన సీస పద్యాలనే వాడారు శైవగురువైన విశ్వేశ్వరుల వారిని వర్ణిస్తూ

"సంజ కెంజాయలో జలకమాడెడి జటాజూటముయూఖరింఛోళి యెగయ
ఎగుభుజంబులఁదాఁకి నిగనిగల్ పచరించు ముత్తెపుఁ దమ్మంట్లు మురువుఁ గొలుప
చిఱునవ్వు వెన్నెలల్ చింఁదు నెమ్మోమున శాంతి పీయూషంబు జాలువాఱ
మెడనుండి దిగఁజాఱె వెడఁద ఱొమ్మునవ్రేలు స్ఫటికాక్షమాలిక చౌకళింప
ఫాలభస్మత్రిపుండ్రముల్ ప్రాఁబలుకుల చందమునఁ గ్రాలశైవదీక్షా గురుండు

బ్రాహ్మతేజమాకారంబుఁబడసెననఁగ నెదుట సాక్షాత్కరించె విశ్వేశ్వరుండు" అన్నాడు

జటాజూటంలోని సంజకెంజాయలు, చెవుల వ్రేలాడు ముత్యాల తమ్మంట్లు ముఖంలోని ప్రశాంత వర్చస్సు, మెడలో వ్రేలాడు స్ఫటిక రుద్రాక్షలు, నొసట నున్న త్రిపుండ్రాలు మూర్తి చిత్రణ కెంతో తోడ్పడ్డాయి త్రిపుండ్రాలను వేదత్రయంతో పోల్చటం వలన గురుదేవుని పవిత్రతా మహత్వాన్ని గూడా వెల్లడించినట్లైనది పద్యంలోని తూగు శ్రీనాధుని సీసాన్ని గుర్తుకు తెస్తుంది బంది నుండి విముక్తుడై వచ్చిన, గణపతి దేవుని వర్ణించు సందర్భంలో కూడా సీసాన్నే వాడారు

"కడకంటి గవర రేకల డాఁగి తులకించు
మగసిరి యొక్కింత మొగముఁజూప
కొనగోట దువ్విన నునుమీసకట్టులో
రాచపోఁడుములు దోబూచులాడ
వెడఁద ఱొమ్మునఁ దొంటి విన్నఁబాటెడఁ బాపి
దొరతనమ్మల్లనఁ దొంగిచూడ
జగజంపుఁగైదోయి సైదోడుగాఁ దోఁచు
నెఱజోదు బికంబు నిక్కిచూడ

నోరుగర్వీధి మొగసాల దారివెంట
సాగె నొకనాఁటి మునిమాపు జామునందుఁ
బెఱలమోముల వింతగా నరయువాఁడు
చూపఱకు నచ్చెరువు గొలుపు సొగసుకాఁడు

కడకంటి గవరరేకలూ, కొనగోట దువ్విన నునుమీసకట్టు వెడద ఱొమ్మూ, ఆజానువైన కైదోయీ, మగసిరినీ, రాచపోడిమినీ, దొరతనాన్నీ, నెఱజోదుబిం కాన్నీ వెలువరిస్తూన్నాయి దేశీయములైన కమ్మని తెలుగు పలుకుబడులతో తెలుగుభాషా సౌందర్యాన్ని చిత్రించినట్లు ఈ మూర్తి చిత్రణం అద్భుతంగా గణపతి దేవుని నిండు యౌవనాన్ని సూచిస్తున్నది

## కృష్ణానది వర్ణన

"సహ్యభూభృత్కుల స్వామి యౌదలమోచి
లాలించి పెంచు గారాల కూన

శ్రీశైల శిఖరాగ్ర చిన్మూర్తి యైవెల్గు
　　శ్రీమన్మహాదేవు చెలిమికత్తె
అమరేశ్వరస్వామి యాస్థాన నర్తకి
　　సముదాయనృత్త శిక్షాప్రదాత్రి
ఇంద్రకీలాచలం బెక్కి లోకంపేలు
　　కనకదుర్గమ్మకు ననుంగుం జెల్లి
కాకుళ క్షేత్రమున నాంధ్ర కైటబారి
యంఘ్రి యుగ్మము సేవించు నమలచరిత
కర్షకాంధ్ర ప్రజానీక కల్పవల్లి
నిక్కమగుతల్లి కృష్ణవేణీమతల్లి"

కృష్ణానదిని చూచినపుడు కవికి కల్గిన హృదయ స్పందనకు ఈ పద్యం ప్రతీక అయన జడరూపమైన నదిలో నదీదేవతను దర్శించాడు ఆ వెంటనే పవిత్రమైన ఆమె జన్మ చరిత్ర దృగ్గోచరమయింది "సహ్యాభూభృత్కుల స్వామి యొాదల మోచి లాలించి పెంచు గారాల కూన" భూభృత్కుల స్వామి అంటే పర్వతరాజు, రారాజు అనే రెండర్థాలు వస్తున్నాయి రాజులు నెత్తిపై బెట్టుకొని మోస్తున్నారు కాబట్టి 'గారాలకూన' అనే ప్రయోగం అర్థవంతగా ఉంది శ్రీశైల స్వామి చెలిమికత్తెగా, అమరేశ్వరస్వామి దేవదాసీలకు నృత్తశిక్షనిచ్చే నాట్యోపాధ్యాయగా, కనకదుర్గమ్మకు అనుంగు చెల్లెలుగా, శ్రీకాకులం స్వామికి పాదాభిషేకం చేసే భక్తురాలిగా, కర్షకాంధ్రలోకానికి కలిమినిచ్చే కల్పవల్లిగా, ప్రజలందఱకూ నిక్కమైన తల్లిగా ఆయనకు దర్శనమిచ్చింది ఆదివ్య దర్శనంతో పరవశుడై ఈ పద్యం వ్రాశారు

విశేషాలు సహ్యపర్వతంలో పుట్టటం వలన ఆ పర్వతానికి కూతుర యింది శ్రీశైల దేవాలయానికి సమీపంగా ప్రవహించటం వలన ఆ స్వామికి చెలికత్తె అయింది అమరావతి దగ్గర కొండ గుట్టల ప్రక్కగా ప్రవహించటం వలన అలలులేచి నాట్యం చేస్తున్నట్లుంటాయి అందువలన నాట్యోపాధ్యాయి అయింది కనకదుర్గమ్మ నానుకొని ప్రవహించటం వలన చెల్లెలయింది నది పొంగినపుడు శ్రీకాకుళస్వామి పాదములను ముంచుతూ ప్రవహించేది గావున పాదాభిషేకం చేసే భక్తురాలయింది తన జల ప్రవాహంతో పొలాలను సుక్షేత్రాలుగా మార్చి ధాన్య సంపద నిస్తుంది కావున కర్షకులకు కల్పవల్లి అయింది నీరే ప్రాణాధారం అన్నారు గదా! ప్రజలకందఱకూ ప్రాణాధారమైన

నీరిచ్చి  తల్లి అయింది

## కోడికూత

"కాలసమ్రాట్టు మొగసాలగంట పగిది
వేద పారంబులకుఁ బూను విప్రుభంగి
ఱెక్కలల్లార్చి మెడ నిట్ట నిక్కఁజాఁచి
కాక్కొరోకో యనుచుఁగూసెఁ గోడిపుంజు"

కాల సమ్రాట్టు మొగసాలగంటగా కోడికూతను పోల్చటం సర్వాతిశాయి ప్రజ్ఞావిలసితంగా ఉన్నది కోడిపుంజుకు 'కాలజ్ఞము' అనే పేరున్నది కాలసమ్రాట్టును కాలజ్ఞం మొగసాలగంటగా ఉండటం కేవలం ధ్వనిరూపసామ్యం కోసమే కాదు సమయ పరిపాలనా నియమం కోసం కూడా అనే విషయం ధ్వనిస్తున్నది ఱెక్కలల్లార్చటం, మెడసాచటం మొదలైన విశేషణాలు, బ్రహ్మచారి నిద్రనుండి లేచి ఒళ్లు విఱుచుకొనటం, ఆవులించటం, కాళ్లూ చేతులూ విదుల్చుకోవటం వంటి సహజ ధర్మాలను గుర్తు చేస్తున్నాయి విప్రుభంగి అంటే విప్రవటువు భంగి అని గౌణంగా అర్థం చెప్పకోవాలి ఈ స్వాభావిక చేష్టలను సందర్భోచితంగా, సరస మంజులంగా ఉపమానోపమేయభావంతో చెప్పటం ప్రజ్ఞాశాలియైన కవికి తప్ప ఇతరులకు వలనుపడదు ఎంతో అర్థభారాన్ని మోస్తున్న ఈ చిన్నపద్యం పరమ రమణీయంగా ఉన్నది

## తాత్త్విక చింత

కవికి ఆధ్యాత్మిక విద్యానుభవం ఉంటే ఉత్తమ చిత్త సంస్కారం కలుగుతుంది ఆ సంస్కారం కవితా మహనీయతకు తోడ్పడుతుంది పూర్వ మహాకవులలో చాలమంది ఋషితుల్యులుగానే జీవించారు "నానృషిః కురుతే కావ్యమ్" అనే ప్రవచనం తాదృశులవలననే వ్యాప్తిలోకి వచ్చింది

సుబ్బారావు గారికి ఆధ్యాత్మిక విద్యానుభవం ఉన్నది ద్వాదశోపనిషత్తు మాండూక్యోపనిషత్తు, గౌడపాదీయ కారికలు శంకర భాష్యం దానికున్న ఆనందగిరి వ్యాఖ్య శ్రీ భాష్యం, భగవద్గీత మున్నగు ఆధ్యాత్మిక విద్యా ప్రధానమైన గ్రంథాలు చదివి అర్థం చేసికొన్నారు అవసరమైనపుడు ఆ అనుభవాన్ని కవిత్వం ద్వారా వెల్లడిస్తుంటారు మచ్చుకొక్క పద్యం చూడండి

"తొలి సృష్టించె విధాత లోకమున నీతోయంబుఁగల్వాది, నీ
జలధుల్ మూలము లీచరాచర జగత్సంసారవారాశి, క
వ్వలితీరంబు నెఱుంగ నేరక నరుల్ భ్రాంతిన్ దదూర్మిచ్ఛటా
కులులై జన్మపరంపరం బడుచు సంక్షోభింతు రశాంతమున్"

గణపతి దేవుడు సాగరసంగమంలో భార్యలతో స్నానం చేస్తూ సాగరసందర్శనం వలన కలిగిన ఒక క్రొత్త అనుభూతితో పైవిధంగా అనుకొంటాడు

బ్రహ్మసృష్టిలో మొదటిది జలం ఈ జలధులు జగత్సంసారవారాశికి మూలాలు సంసార సాగరానికి అవతలి ఒడ్డు తెలియక తదూర్మిచ్ఛటలకు తట్టుకోలేక ప్రాణులు జన్మపరంపరలు అనుభవిస్తూ ఉంటారు అని భావం అవ్వలి తీరము = మరణానంతర వృత్తాంతము (లేక) పరమార్థము

తత్ + ఊర్మిచ్ఛటల్ ఇచట శ్లేషార్థమున్నది

సముద్రపరంగా అలలపరంపర సంసారపరంగా షడూర్ములు (షట్ + ఊర్ములు) ఆకలిదప్పులు, శోకమోహాలు, జననమరణాలు అని అర్థం సంసారి షడూర్ములలోఁబడి దిక్కుతోఁచక క్షోభిస్తూ ఉంటాడనీ, సముద్రంలో దిగినవాడు అలలతాకిడికి తట్టుకోలేకా, అవతల ఒడ్డు చేరలేకా క్షోభపడుతుంటాడనీ దీనిభావం రవంతైనా వేదాంత పరిచయం లేనివారికి ఈ శ్లేషార్థం బోధపడదు

గణపతి దేవుడు పిన్నచోడుని పుత్రికలను పెండ్లాడి క్రొత్త పెండ్లికొడుకై భార్యలతో సాగరసంగమంలో ఆనందంగా స్నానం చేస్తున్నపుడు శృంగార భావాలు స్మృతికి రావాలి గాని వేదాంత విషయాలు స్ఫురించటం ఏమిటి? అని పాఠకులు ఆక్షేపించవచ్చును ఇచ్చట గణపతి దేవుడు సముద్రాన్ని సముద్ర రూపంలో చూడలేదు కాళిదాసు హిమశైలంలో దేవతాత్మను దర్శించాడు 'అస్త్యుత్తరస్యాం గిరి దేవతాత్మా హిమాలయోనామనగాధిరాజః' అని కుమార సంభవ కావ్యంలోని మొదటి శ్లోకం మహాకవులూ, ఋషులూ, భక్తులూ జడపదార్థాల్లో దేవుణ్ణీ, మానవుణ్ణీ చూశారు ఒక వేద ఋషి ఉదయించే సూర్యుణ్ణి చూచి "బంగారు రథమెక్కి లోక రక్షణార్థం బయలుదేరిన మహాప్రభువులాగా ఉన్నాడు" అని వర్ణించాడు జడ పదార్థమైన సూర్యగ్రహంలో ఆయనకు లోకాన్ని రక్షించే మహాప్రభువు కన్పించాడు

విశ్వేశ్వర మహాగురుని బోధలతో గణపతిదేవునికి తాత్త్విక చింతనతో గూడిన

ఉత్తమ చిత్త సంస్కారం లభించింది సాగరుడు తన తరంగ హస్తాలతో గణపతిదేవుని ఆలింగనం చేసికొన్నట్టు ఒక క్రొత్త అనుభూతిని పొందాడు ఆవింత అనుభవంతో ఆయనకు సముద్రునిలోని దేవతాత్మ దర్శనమిచ్చింది అలాంటి దివ్యదర్శనం పొందిన తర్వాత భౌతిక రూపాలు కన్పించవు ఐహిక చింతనలుండవు అందువలననే ప్రక్కనున్న భార్యలను గూడా మఱచిపోయాడు తాత్త్వికచింత హృదయంలో ప్రవేశించింది సాగరదర్శనం సంసారసాగరాన్ని గుర్తుకు తెచ్చింది పారమార్థిక దృష్టితో ఆలోచించాడు ఆ ఆలోచనల ఫలితమే పై పద్యంలోని సారాంశం

## హితబోధ

పిన్నచోడుని భార్య తన పుత్రికల నత్తవారింటికి పంపునపుడు చేసిన హితబోధలోని పద్యాలు కవికున్న లోకవృత్త పరిజ్ఞానాన్నీ, ఆర్ద్రహృదయాన్నీ వెల్లడిచేస్తున్నాయి కొన్ని పద్యాలు చూడండి

1 "అనుఁగుఁ గూతులార! అల్లారుముద్దుగాఁ
గన్నదాన, పెంచుకొన్నదాన
నిల్లువెడలనంపి యీరీతిగా మీకు
దూరమగుటఁ దలఁపనేర నైతి-

2 ఒక్కచోట నిల్వ దుర్వీపతుల చిత్త
మెచ్చులొచ్చు లుండవచ్చుఁ బ్రేమ
నీసుచెందకుండుఁ డిర్వురు మీలోన
సవతులను గనుండు సఖుల మాడ్కి

3 పరిజనంబుతోడ పరిహాస మొప్పదు
కేరడంబు దగదు కినుక జనదు
కార్యజాతమెల్ల కనుసన్ననడపుట
రాణివాసమునకు రాణతెచ్చు

4 అంతిపురిని మెలఁగు నింతుల నొకరీతి
నమ్మకుండరాదు నమ్మరాదు
కొండెకత్తియలను గుర్తింపవలెఁ గాని
తిట్టరాదు చెలిమి కట్టరాదు

5 పేద సాదుల యెడ విధివంచితుల యెడ
కనికరంబుc జూపc గలుగు శుభము
బక్తి వినయములను బాటింప వలెనమ్మ
పెద్దలందు జ్ఞానవృద్ధులందు

6 పుట్టినట్టి యింట మెట్టిన యింటను
బ్రాcకుcగీర్తివల్లి పడతి కతన
నుబయ వంశములకు నూర్జస్వలంబైన
పెంపుc, గూర్పుcడనుcగు బిడ్డలార!"

తియ్యని తెలుగు నుడికారంతో సజీవ భాషలో పద్యరచన హృదయావర్జకంగా సాగింది అనుభవంతో పండిపోయిన హితబోధకూడా నిరాడంబరంగా సాగిపోయింది

ఈ బోధ శకుంతల నాటకంలో కణ్వుడు శకుంతలకు చేసిన హితబోధను గుర్తుకు తెస్తున్నది తెలుగింటి ఆడపడుచులను అత్తవారింటికి పంపే సమయంలో తల్లులు పడే హృదయావేదనను కూడా ప్రత్యక్షం చేస్తున్నది నైషధంలో భీమరాజు దమయంతికి చేసిన హితబోధను గూడా ఈ హితబోధ గుర్తుచేస్తున్నది కణ్వుడు ఆజన్మ బ్రహ్మచారి ఐనా పసికూనను దెచ్చి అల్లారుముద్దుగా పెంచుకొన్న మమకారం శకుంతలపై ఆయనకున్నది ఆమె వెళ్లేది రాజాంతఃపురానికి అంతఃపుర ప్రవర్తనలు, నియమావళులు ఆయనకు అనుభవంలో లేనివి కావున ఆయన చేసిన హితబోధ లోకసామాన్యంగా ఉన్నది

భీమరాజుకు అంతఃపురానుభవాలు రాణులకు సంబంధించినంతవఱకే తెలుస్తాయి మగవాడు కావున పరిచారికల విషయాలు అంతగా తెలియవు అందువలన ఆయన చేసిన హితబోధకూడా లోకసామాన్యంగానే ఉన్నది

పిన్నచోడుని భార్య రాణిగా అంతఃపుర నియమావళులూ, రహస్యాలూ పరిచారికల లోతుపాతులూ సమగ్రంగా తెలిసిన వ్యక్తి - మాతృమూర్తిగా, రాణిగా అనుభవపూర్వకంగా ఆమె తెలిసికొన్న విషయాలను కూతులకు బోధించింది కాళిదాస-శ్రీనాధులు పురుషులచేత హితబోధ చేయిస్తే సుబ్బారావుగారు స్త్రీమూర్తిచేత చేయించటం ఔచిత్యశోభితంగా ఉన్నది ద్విరుక్త ప్రాసయతులతో, అలతియలతి తెలుగుపలుకులతో లయాన్వితంగా నడచిన యీశైలి పద్య గౌరవాన్ని ఇనుమడింప జేస్తున్నది "రీతిరాత్మా కావ్యస్య" అని వామనుడు చెప్పిన లక్షణానికి ఈ పద్యాలు లక్ష్యభూతములై నాన్యతోదర్శనీయంగా ఉన్నాయి

# వ్యుత్పన్నత

కవికి ప్రతిభకు తోడుగా సమగ్రమైన వ్యుత్పన్నతకూడా సహకరిస్తే ఆ కవిత్వం సర్వాంగసుందరంగా ఉంటుంది వ్యుత్పత్తి అంటే కేవలం శాస్త్ర పాండిత్యమే కాదు దానితోపాటు లోకవృత్తపరిజ్ఞానం, ధర్మాధర్మ సత్యాసత్య వివేచన, ఉచితానుచిత పరిశీలన, సర్వప్రాణి సానుభూతి మున్నగునవన్నీ వ్యుత్పత్తి పరిధిలోనివే ఈ లక్షణాలన్నీ ఉంటేనే కవికి ఉత్తమచిత్త సంస్కారం లభిస్తుంది ఆ సంస్కారంతో చేసిన రచన అగ్రశ్రేణిలో నిలుస్తుంది

లోకానుభవాన్ని సూచించే కొన్ని పద్యపాదాలను చూడండి

1 "పడతిరేగ త్రాచుపాముగాదె"

2 కాలమొక్కరీతిఁగడవదెవ్వారికి
రాజు కొలువ బంటు రాజ్యమేలు

3 దారములేక క్రొవ్విదకుఁదార్చిన పూవులు నిల్వనేర్చునే

4 పగతు బుద్ధినెపుడు పాపపుఁబుర్వులు
తొలుచునో యెఱుంగ నలవి కాదు
ముప్పుమూఁడినపుడు ముత్తాత దిగిరాఁడు
ధాతకైన వాని తాతకైన- ఇలాంటి లోకోక్తులు కావ్యంనిండా పుష్కలంగా కన్పిస్తాయి

రక్కెసగంగ సాహిణి నోడించి విజయదశమినాటికి తిరిగివచ్చిన గణపతిదేవునికి ఏకశిలానగరంలో అపురూపమైన స్వాగతం లభించింది దసరా పద్యాల ధోరణిలో బాలకులిచ్చిన బ్రహ్మదీవెనలతో కావ్యాన్ని ముగించటం శుభోదర్కంగా ఉన్నది సందర్భశుద్ధిగా కూడా ఉన్నది

"కాకతీయ తరంగిణి" కావ్యాన్ని చదివిన సహృదయులు కవిగారికి "జయంతి తేసుకృతినో రససిద్ధాః కవీశ్వరాః" అని బ్రహ్మ దీవెనలు ఇవ్వకుండా ఉండలేదు

స్వస్తి

చిన్నము రామయ్య చౌదరి

# నామాట

"చదివితి నేను సద్గురులసన్నిధి సంస్కృతభాష, నాంధ్రముం
జదివితినేన, నల్పది వసంతము లాదెసఁ జూడకుంట నా
మదినెలకొన్న విస్మృతిని మాన్పఁగనేర్చిన మిత్రమండలిన్
మొదటివిపశ్చిదగ్రణిని మొవ్వవృషాద్రిపతిన్ నుతించెదన్"

1985వ సంవత్సరమున సుహృన్మణులు శ్రీ ఎ వి ఎస్ ఆర్ ఆంజనేయులు గారు, శ్రీ గూడపాటి వెంకటేశ్వరరావుగారు నాకు సన్మానముఁ దలపెట్టిరి దానికి మాయనుఁగు సోదరులు శ్రీమాన్ నల్లూరి విఖనసభట్టాచార్యులు గారు, ఉపన్యాసచతురానన,సాహితీవాచస్పతి శ్రీమాన్ మొవ్వవృషాద్రిపతిగారు తోడై మఱికొందఱ విద్వత్కవిమిత్రులఁ గూడగట్టుకొని పెద్దయెత్తున సాగించిరి దానిని నేను సమ్మతింపనేరక నాకాప్తులును గురుకల్పులునగు యశఃకాయులు తుమ్మలవారికి నా సంకటముఁ దెల్పుకొనఁగా, "మీకు సమ్మతము కాక పోయినను కవిపండితుల యభిప్రాయము నౌదలఁ దాల్పకతప్ప"దని నాకు హితోపదేశముఁ జేసి వారే ముఖ్యాతిధిగా విచ్చేసి 6 గంటలపాటు వేదిక మీఁదనుండి కార్యక్రమము సాగించిరి

ఆ సభనధ్యక్షించినవారు నా హృదయనిర్విశేషులు శ్రీ వృషాద్రిపతిగారు వారి యధ్యక్ష ప్రసంగమున నన్ను కావ్యరచనకుఁ బూనుకొనుమని యుద్బోధించినారు నాఁటినుండి నన్ను హెచ్చరించుచునేయుండిరి కాని నా కావ్యరచన సామర్థ్యము నాకు శంకాస్పదమే అయినను వారి యొత్తిడిచే నంగీకరించియు నితివృత్తనిర్ణయముఁ జేయనేరక, యా భారమును వారి మీఁదనే మోపితిని కొంతతడవు వారాలోచించి, కాకతీయ చరిత్ర సమగ్ర పద్యకావ్యముగా రచించుట మేలని ప్రోత్స హించిరి

కాని నేను చరిత్రనిష్ణాతుఁడఁగాను ఏమి చేయవలె? కాకతీయ సంచికఁ బరిశీలించి దానినాధారముగాఁ జేసికొని రచన కుపక్రమించితిని నాఁటికి నలువదేండ్లపాటు సాహిత్య గంధము సోఁకని రంగమునఁ గ్రుమ్మరినవాఁడను శారదానుగ్రహము, విద్వత్కవి పుంగవుల యాశీస్సులు నాకుఁ గొంత శక్తిని చేకూర్పుటచే నీ కావ్యము నీపాటి రచింపఁజాలితిని కాని నాయనారోగ్యము, నితరకారణములు ప్రతిబంధకములగుటచేఁ గావ్యరచన నిలిచిపోయినది "శ్రేయాంసి బహువిఘ్నాని" కదా!నా శ్రేయోభిలాషులగు మిత్రుల యభిమతానుసారమింతవట్టునొకభాగముగాఁ బ్రకటించి, ద్వితీయభాగ రచన

కొనసాగింపఁదలఁచితిని

ఇది చరిత్ర కాదు చరిత్రాధారమైన కావ్యము చరిత్రకు దూరము కాక కావ్యానుకూల సన్నివేశకల్పనములతో సాగినది కాకతినిలువేల్పుగా నారాధించిన కాకతీయవంశమును గూర్చిన కధలెన్నియో కలవు కన్నడ దేశమునఁ గాకతియను పేరుగల గ్రామమొకటి యున్నట్లు కాకతీయ సంచిక ధ్రువపఱిచినది ఆ కాలమునఁ బ్రతి గ్రామమునకు నొక గ్రామదేవతను ప్రత్యేకముగా నారాధించు సంప్రదాయము కలదు ఆ గ్రామదేవతనే కొందఱు తమ గృహదేవతగా నారాధించు నాచారము కలదు కొన్నిచోట్ల గ్రామము పేరనే గ్రామదేవతయునుండును ఆ సంప్రదాయ మాంధ్రదేశమున నిప్పటికిఁ గలదు కాకతి గ్రామమునకుఁ గాకతి గ్రామదేవతయు, కాకతీయులకు గృహదేవతయునై యుండును కాకతీయులు కాకతి గ్రామమునుండియే చాళుక్యరాజన్యుల దండనాధులుగా నాంధ్రదేశమునఁ బ్రవేశించి కొంతకాలమునకు సామంతులై గణపతిదేవుని కాలమున నాతఁడు శక్తియుక్తుల ననుసంధించి మహాంధ్ర సామ్రాజ్యనిర్మాతయై చక్రవర్తియైనట్లు నేను భావించితిని అందులకుఁ గారణములు కాకతి గ్రామము గుర్తింపఁబడుట, మొదటి ప్రోలరాజు కాలపు శాసనములు కన్నడ భాషలోనుండుట ఆంధ్రదేశమున సంస్కృతముననో తెనుఁగుననో యుండఁదగిన శాసనములు కన్నడమున నేలయున్నట్లు? ఇది నా యూహకు మూల కారణము

కాకతీయులు కన్నడిగులన్నంతమాత్రమున నాంధ్రులకు తలవంపులుగా భావింపవలసిన యవసరములేదు ఆంధ్రదేశమును పాలించిన సాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, శాలంకాయనులు మున్నగు వారందఱు నాంధ్రులేనా? మనము వీరావేశముతోఁ గీర్తించు పలనాటి వీరులు సైతమాంధ్రులుకారు వారెల్లరు తెనుఁగు గడ్డపై స్థిరపడి యిక్కడి గాలిపీల్చి, నీరు ద్రావి, తెనుఁగు ముద్రలు పొందినవారు మనయామోద ముద్రలనందినవారు కాకతీయులునట్టివారే కావచ్చునన్నది నా యూహమాత్రమే ఈ విషయమును సిద్ధాంతీకరింపవలసినవారు చరిత్ర పరిశోధకులు

మాకాప్తసుహృన్మణులు వృషాద్రిపతిగారి ప్రగాఢాకాంక్ష యీ కావ్యమునకు బీజము బీజమును విత్తి వారు చేతులు దులుపుకొనలేదు అది యంకురించి, పల్లవించి, పుష్పించి, ఫలించువఱకుఁ బరామర్శించుచునేయున్నారు వారి సహృదయతకు, సౌహృదమునకుఁ గొలఁబద్దలేదు వారికిఁ గృతజ్ఞతఁ దెలుపుకొను తీరు నా కగపడకున్నది

నా యీకావ్యము నామూలాగ్రముగాఁ బరించి తమ యామోదసూచనలతో

నన్నుఁ బ్రోత్సహించినవారు ఉభయభాషాప్రవీణులు, ప్రామాణికవిద్వత్కవులు, వయోజ్ఞాన వృద్ధులు శ్రీమాన్ చిన్నము రామయ్యచౌదరిగారు కాళిదాస మహాకవియంతటివాఁడు "బలవదపిశిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః" అని శంకింపగా నావంటివారి విషయముఁ జెప్పనేల? కాని రామయ్యచౌదరి గారి ప్రోత్సాహము నాకుఁ గొంత యాత్మప్రత్యయము నొసఁగినది అట్లు కానిచో నీ కావ్యము ప్రకటింపఁబడునదేకాదు వారు ప్రోత్సహించుటయేకాదు, ముద్రణ స్ఖాలిత్య పరిహారమునకుఁ గూడ శ్రమించిరి వారికి నాయెడఁ గల సద్భావమట్టిది

"క్రొన్ననతావులం గవితఁ గూర్చు కవీంద్రుఁడు, సంస్కృతాంధ్ర సం
పన్నిధి, సద్గుణగ్రహణభావుకసత్తముఁడున్ మనస్వియున్
చిన్నయ శాస్త్రవిద్వరుఁడు చిన్నము రామయచౌదరిన్ మద
భ్యున్నతి కామునిందలఁచి మోడ్పుఁ గృతజ్ఞతఁ బాణియుగ్మమున్"
అని చెప్పుకొనుటకంటె వారికి నేనేమి చేయఁగలను?

"పరగుణ పరమాణూన్ పర్వతీ కృత్యనిత్యం
నిజ హృదివికసన్త స్సంతిసంతఃకియంత"

అమూల్య మృదుమధుర శైలీ విన్యాసములు గల తమ పీఠికలతో నా కావ్యకళావిశేషముల నావిష్కరించి సుమనస్సంతతి కామెతలొసఁగిన సాహితీమంధాద్రులైన శ్రీ వృషాద్రిపతి రామయ్య చౌదరులకుఁ గృతజ్ఞతఁ దెలుపుకొనుచున్నాఁడ

మనోజ్ఞ చిత్రకళాశేముషీ నిధానమైన ముఖచిత్ర విన్యాసముతో గ్రంథమునకు రామణీయకమును సమకూర్చిన సహృదయ మిత్రులు జె కె సి కళాశాలాంధ్రోపన్యాసకులు శ్రీమాన్ పులిచెర్ల సుబ్బారావుగారికి నా సప్రశ్రయ కృతజ్ఞత

ఇఁక నీ కావ్య ముద్రణమునకై యహరహము శ్రమించి ముద్రణ స్ఖాలిత్యములఁబరిష్కరించుట యందత్యంత జాగరూకతతోఁగృషి సల్పిన మా యనుఁగు మిత్రులు, స్వతంత్రవాణి సంపాదకులు శ్రీమాన్ కొల్లా శ్రీకృష్ణారావు గారి సౌజన్యముఁదూఁచు పనిముట్లు నాకడ లేవు ఆయన యుత్తమ స్థానమట్లే యుండును కావ్యరచనమున నా కృతజ్ఞతను నిర్ణయింపఁదగినవారు రసజ్ఞసాహితీ ప్రియంభావుకులు

"అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః
యథాఽస్మై రోచతే విశ్వం తథే దం పరివర్తతే"

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

గురునకు ధిషణాజితసుర
గురునకు శిష్యప్రశిష్యకోవిదసుమన
స్తరువున కంహోహరునకు
వరదాచార్యునకొనర్తుఁ బ్రణతిశతంబున్"



కీ.శే. యార్లగడ్డ వెంకన్న చౌదరిగారు

# ఉపహారము

పున్నెముఁగోరి సన్నిధికిఁబోయినభక్తులఁ గొండమీఁది వెం
కన్న సమస్తముం గొటిగి యంపుచునుండఁగ, యార్లగడ్డవెం
కన్న దవిష్టులంబిలిచి యర్థులకొంగున మూటఁగట్టి సా
మ్మొన్నక కేల్గవంగమిచియిచ్చుట యచ్చెరు వర్థికోటికిన్

ఎందఱొ కోట్లకుంబడగలెత్తిన మేటికుబేరు లుర్విపై
నుందురుగాక! విత్తవినియోగవిచక్షణ దానశౌండు లే
వందకొవేయికో దొరకవచ్చు నొకం, డటువంటి వారిలో
ముందర నీవునిల్చుట ప్రమోదముఁగూర్చుఁగదన్నవెంకనా!

పాత్రులకీయకుంటయు నపాత్రులకిచ్చుట దోసమందు, రా
సూత్రమెఱింగినట్టిసరసుండవుగావున రాచపుంటి యా
స్పత్రికి లక్షలేఁబదియొసంగితి, నీసరివచ్చుదాత లీ
ధాత్రిని లేమిఁ దావకవదాన్యతకుంగయిమోడ్పు లిచ్చెదన్

అనుఁగుందమ్ముఁడు రంగనాయకులు నీ వానాఁటి శ్రీరామల
క్ష్మణులైయుందురు భిన్నదేహముల నైక్యమ్మొందు వాక్చిత్త వా
సనలొక్కింతపరీక్షసల్పఁగ, భవత్సౌభ్రాత్రసంబంధముల్
కనరావీ కలికాలసంజనితసంఘమ్మందు గాలించినన్

నిత్యమురంగనాయకు లనేక కవీంద్రకృతప్రబంధ సా
హిత్యరసోర్మిమాలికల నీఁదెడు రాజమరాళ; మట్టిసాం
గత్యమువాయఁబండితులు కన్గవనోడ్చిరి కోష్ణబాష్పముల్
మృత్యువు సజ్జనాసువుల మ్రింగికదా తనివోవు నిచ్చలున్

ప్రత్నగుణాంశుమాలికలఁ బాయఁగనొల్లని మానినీ శిరో
రత్నము రత్నమాంబకుఁజిరంతనపుణ్యఫలంబు నిన్ను నీ
పత్నిని రాజ్యలక్ష్మమను పంకజసూతి సృజించువేళ నే
నూత్నకళారుచుల్ బెరసెనో మిథునంబుగ మిమ్ముఁగూర్పఁగన్

శ్రీదేవిపాదాలఁ జిఱుగజ్జెలులియు నీ
నట్టింట వెలయించు నర్తనంబు
వాగ్దేవి కచ్ఛపీవల్లకీ గమకాల
వర్ణించు నీయశోవైభవంబు
కాత్యాయనీదేవి కడగంటిసిరులతో
వర్షించు శాశ్వతైశ్వర్యగరిమ
అక్షయ్యనిధిశాలి యక్షేశ్వరుండు నీ
వాణిజ్యవీధులఁ బాలికాఁపు
అక్కదమ్ము లిర్వురాస్థానకవి పీఠ
మధివసించి కొలువ,నందలమున
దక్షిణాపథాన దానహస్తంబెత్తి
రాజ్యలక్ష్మి నేలు రాజవీవు

నీ దేశభక్తికి నిద్దంపుటద్దమౌ
చిత్రహింసల జైలుశిక్షసాక్షి
కవితారసజ్ఞశేఖరగౌరవమునకు
సత్కృత కవిసుధీజనముసాక్షి
ప్రాక్ప్రతీచీ జగత్ప్రగతిసంస్కృతులకు
సంగమస్థలి పాఠశాలసాక్షి
తత్త్వవిత్తమ జగత్ప్రఖ్యాతకీర్తికిఁ
బలుకోవెలల సత్రపాళిసాక్షి

సకల జీవప్రియత్వంబునకు వివేక
చతురగతులైన నీ మహోక్షములు సాక్షి
నీకళాతృష్ణకవధియై నిలచి లోక
ప్రస్తుతింగన్న 'నమ్మినబంటు' సాక్షి

బందుగులీయఁజూపిన యపారధనంబు గ్రహింపనొల్ల కిం
కెందుకు నాకుఁ జాలుఁ బరమేశ్వరుఁ డిచ్చినదానఁదృప్తినే
నందితి నన్నయుత్తమగృహస్థశిరోమణి నాయఁడమ్మకున్
నందనుఁడైన నీదుసుగుణంబులకున్ గణనంబులేఁటికిన్

అన్నరో! నీదునెమ్మొగమునైనఁ గనుంగొనవేరనైతి నీ
వున్నదినంబులందు, వినియుంటిభవచ్చరితంబు, నేఁటికే
పున్నెముపండెనో యిటులబుద్ధిజనించి మదీయకావ్యమీఁ
గన్నయదృష్టమబ్బెఁగలకాలము త్వద్గరిమన్ స్మరింపఁగన్

ఆదిగర్భసంపన్నుఁడవైనఁగాని
గర్వగంధమ్ముసోఁకని కర్షకుఁడవు
కర్షకుఁడవైననేమి సత్కవులనుండి
కీర్తిరత్నాల నార్జించు వర్తకుఁడవు

ఏతాదృక్సుగుణాభిరామునకు నీకీమెప్పు లంభోధిపై
నేతామెత్తుట, చందమామ కొకపోఁగీజాపుటౌగాని నా
చేతోవీధిని బాయకున్నయది పుంజీభూతపుణ్యాకృతి
స్ఫీతంబైన భవచ్చరిత్రము ప్రజాశ్రేయఃపదంబౌటచే

కులముఁదలంచికాదు మనగోత్రమొకండనియెంచికాదు నీ
కలిమిగణించికాదు గుణగౌరవలుబ్ధుఁడనై యొసంగితిన్
తెలుఁగు మగంటిమిన్ నిఖిలదిక్కులఁజాటిన కాకతీయరాట్
తిలకసమగ్ర శౌర్యసముదీర్ణకథానిధియైన కావ్యమున్

నిన్నతిలోకసద్గుణు మనీషివరేణ్యుని విస్మరించి యో
యన్న! మదీయకావ్య మెటులన్యునకంకితమీయనేర్తు? నీ
మన్ననమిన్నుభాస్కరుఁడు మారుతవార్ధులు గల్గుదాఁక న
చ్ఛిన్నభవద్యశోగరిమ చెన్నుఁదొలంగక నిల్చుఁగావుతన్

సత్యసదనమావాసము
సత్యసుధీరత్నబిరుదశాలిసగర్భ్యం
డత్యయదూరము సత్యము
నిత్యము సేవించునీ కనిత్యత కలదే

తాతల్ తండ్రులు చన్నసత్యపథముం దప్పండు వో నీతనూ
జాతుండెన్నఁడు సత్కృతి ప్రవణుఁడై శంభుప్రసాదుండు, మీ
చేఁతల్ రీతులు సంస్మరించుకొనుచుం జేపట్టి వర్ధంతులం
జేతః ప్రీతిఘటించు సత్కవిసుధీశిష్టప్రజాకోటికిన్

సమ్మానంబుల కర్హుఁడీతఁడు విశిష్టవ్యక్తియన్నింట, వీ
సమ్ముందగ్గఁడు తండ్రికంటె సుతుఁడీశంభుప్రసాదంచు సం
ఘమ్ముల్ పెక్కు సమాదరింప వినయాంకంబైన వెమ్మోముతో
మిమ్ముంజిత్తమునందు నిల్పుకొనుసుమ్మీ! వానిఁగ్గైసేయుచో,

అవ్యయమైన దివ్యపదమందితి వీ విటనీకుమాటు నా
కావ్యము నీకుమారునకుఁగైవసముంబొనరించి నాఁడ, నీ
భవ్యయశశ్శరీరమెడబాయక యీకృతి సంచరించు సం
భావ్యమనోజ్ఞకావ్యరసపానవిరూఢమహాంధ్రవీధులన్

# ఆముఖము

రారండోయికుమారులార! వితతాంధ్రశ్రీయశః కౌముదీ
నీరంధ్రంబగు నోరుగల్పురము వర్ణింపంగ శక్యంబె? వి
న్నారా? కాకతిరాజవంశపదవిన్యాసాభిరామంబుఁ గ
న్నారం జూతమురండు విక్రమకథావ్యాహారలీలాగతిన్

కాకతిబేతరాజెపుడు కాలిటమోపెనొ నాఁటినుండి యీ
యేకశిలాపురీవిభవహేల మహాంధ్రవసుంధరాస్థలీ
శ్రీకరమై ద్విషద్గణవశీకరమై చలమర్తిగండరా
జాకరమై వెలింగెఁ ద్రిశతాబ్దిసమగ్రమయూఖరేఖలన్

శునకము లాకుఁజింమకొనుచొప్పన నల్గడఁబ్రాతివేశికుల్
తెనుఁగుధరిత్రిఁబంచుకొనఁ దెక్కలికాండ్రనదల్చితోలుచున్
గణపతిదేవుఁడీతెనుఁగుగాదిలితల్లికిఁగాన్కవెట్టెరా
మణిమయసింహపీఠి హురుమంజిసుపాణి మహాతపత్రమున్

పుట్టినదాఁడుబిడ్డయని పొక్కనినీజనకుండు, పిమ్మటన్
దిట్టతనంబుఁజూపి బహుదేశవిపక్షధరాధినాథులం
గొట్టిననీదుశౌర్యమునకుంబులకించి తలంచియుండు నా
పట్టి మహాంధ్రరాజ్యసరపాలశిరోమణి యంచు రుద్రమా!

అప్పటికాలమం దవనివంగనయోర్తుక రాజ్యచక్రముం
ద్రిప్పినజాడ కన్పడదు, తెన్గుసవిత్రికి నిన్నుఁబట్టి యా
గొప్పతనంబుదక్కె, నిరుగుంబొరుగుం బరదేశయాత్రికుల్
మెప్పుల గుప్పినారు నినుమించిన యేలికలేమి రుద్రమా!

అదిగో రుద్రమవచ్చెవచ్చెననుపల్కాలించి యత్తైత్తి యా
యదువీరుల్ పరికించిచూచి వెఱఁబాయల్ పాయలైవిచ్చుచున్,
కదనక్షోణివిహారముల్ సలుపుకంఖాణంబు పైనున్న నీ
పదమూలంబున మూడుకోట్లిడరె సౌవర్ణంబులన్ కాన్కగా

"మగఁటిమిలేనియాంధ్రు లవమానమునెంచక సింహపీరిపై
మగువ నొకర్తునిల్పిరని మానవనాథ! రచింత్రు కావ్యముల్
తగవరులైన మీసుకవితల్లజు, లించుక చూపిపొమ్ము నీ
తెగువ"యటన్నరుద్రమకు దీటెవరోయి వసుంధరాస్థలిన్

యాదవాధీశు మహాదేవునోడించి
మన్నించి దండుగల్ గొన్ననాఁడు
అభ్యసూయకులైన హరిహరుని మురారి
దేవు నాలమున వధించునాఁడు
గుంటూరి నాగన్న కుట్రభగ్నమొనర్చి
తలఁగత్తివాదరఁదఱుగునాఁడు
త్రిపురాంతకుని నంబదేవుని నిర్జించి
కోఱకొమ్ముల నూడఁగొట్టునాఁడు

విక్రమోద్దీర్ణతావక విగ్రహంబుఁ
దలఁచుకొన్నంత నెమ్మేనుపులకరించుఁ
దెనుఁగుజాతి కాత్యాయనీదేవివీవు
భాగ్యవంతులునినుఁగన్నప్రజలు తల్లి!

వర్తింపదేనేఁడు నగరాభ్రవీధుల
నరిభయంకరవరాహధ్వజంబు
వినిపింపదేనేఁడు విమతభీకరమైన
* పంచమహాశబ్దపరిధవంబు
కనిపింపదేనేఁడు కటుమదప్రస్యంది
గండభాగాభీల గజచయంబు
వ్యాపింపవేనేఁడు వాజిరింఖోద్ధూత
గాఢపాంసుచ్ఛటల్ గగనసీమ
కానరాదాయె నేఁడహో కాకతీయ
చక్రవర్తులు మణిగణస్థగితమైన
కుట్టిమాస్థానరంగానఁగొలువు దీర్చి
యధివసించిననాఁటిభద్రాసనంబు

కులములఁజాఁపకూటి కెసకొల్పుటచేఁబలనాటిసీమలో
నలజడిరేఁగి ఘోరవిలయంబుస్సృజించిన, దోరుగల్లునం
గులముల చిచ్చురేఁగి పడఁగూల్చెను కాకతివంశరాజ్యముం
దెలుఁగుల భాగ్యరేఖ కడతేరె విభీషణ శల్యపాత్రలన్

కాలమహాప్రవాహపరిఘట్టనఁబుట్టి మహాతరంగముల్
కూలుచునుండు నెన్నొసిలుగుల్ పొడసూపు, నపారమౌజగ
జ్జాలమె భంగురంబని విచక్షణులెంతురు, కాలమూర్తి గ
ర్భాలయసీమనెంతటి మహాచరితంబులు నిద్రఁజెందెనో

చరితమెఱుఁగు రసిక జనులు కన్నీరోద్తు
రెఱుకలేనివారి కేలవగవ?
హృదయమున్నమనుజుఁగదలించు ఘటనలు
చట్టుబొమ్మ కేమి చక్కిలిగిలి?

---

* పంచమహాశబ్దములు భేరిఐటహము, కాహళము, శంఖప

దర్పోధన్వని మత్సరోరణజయే ధార్యద్విపారోహణే
క్రౌర్యం శౌర్యవిధౌ తురంగదమనేచాపల్య మాశాయుధి
క్రోధోదుష్టజనే భయంద్విజధనా ల్లోభశ్చధర్మార్జనే
పూజాకర్మణిశాంకరే గణపతిక్షోణీపతేరాగ్రహః

నిస్సాణరవసంత్రస్తాః క్షణాద్గణపతేర్నృపాః
అపిత్యజంతిదుర్గాణి నదారానేవకేవలమ్

మల్కాపురశాసనము

# ప్రథమ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

సాతవాహనమహాసామ్రాజ్యలక్ష్మికి
రమణీయ శుద్ధాంతరంగసీమ
ఇక్ష్వాకువంశ్యమహీనాథ దోర్దండ
కోదండపాండితీఖురళిశాల
యోగిమూర్ధన్యుండు నాగార్జునాచార్యు
నాదర్శవిశ్వవిద్యాలయంబు
దక్షిణాశాసతీధమ్మిల్లబంధాన
నవరత్నఖచితమౌనాగిరంబు
కలుషహర బహువాహినీ కంఠహార
తీరగతబహుదేవతాగారశోభి
వీరమార్తాండవిక్రమవిలసితంబు
తెనుఁగు మాగాణమొకనాఁడు తేజరిల్లె

ఆతెనుఁగుం బొలమ్ముఁ గుముదాప్త కులోద్భవులౌ చళుక్యభూ
నేతలు వేంగియుం దపరనీరధిచెంతను రెండు పాయలై
నీతియు రీతియుం గలిమి నేరిమియోరిమిగల్గియేలుచున్
ఖ్యాత చరిత్రులై బలియురై పొలిమేరల నొత్తిరెల్లెడన్

లట మహారాష్ట్ర సీమఁ గల్యాణి నగరి
రాజధానిగాఁబశ్చిమరాజ్యమొకటి
యిచటవేంగియురాజమహేంద్రవరము
నెలవుగాఁ దూర్పురాజ్యంబు వెలసె నొకటి

కన్నడదేశమందుఁగల కాకతికుప్పము కాణయాచిగాఁ
బెన్నిధి కాకతమ్మయిలువేలుపుగా సరిరాచవారిలో
మన్ననఁగాంచు భానుకులమండన దుర్జయవంశజుండు గుం
డన్న చళుక్యభూరమణు నానతి చొప్పనఁ జొచ్చెనాంధ్రమున్

గ్రామము నింటివేలుపును కాకతియౌటఁ దదన్వయంబు త
న్నామముతోడ నీతెనుఁగునాటఁ బ్రసిద్ధివహించియుండ, నే
మేమొ సమన్వయించిరి మనీషులు, తత్కథలెల్లఁద్రవ్వఁగా
సామొనరింపనేటికి రసజ్ఞులచిత్తములుత్తలంపడన్

పూతచరిత్రుఁడానృపతిపుంగవు గుండనపుణ్యపాక సం
జాతుఁ డరాతిభీకరభుజాబలవిక్రమధైర్యసారుఁడౌ
బేతనృపాలుఁ డాంధ్రపృథివీసతికిందలఁబ్రాలు వోసి త
చ్చేతముఁగైకొనెం గౌరవిసీమమనోజ్ఞ వివాహవేదికన్

చాళుక్యావనినాధశేఖరులకున్ సామంతుఁడైబేతభూ
పాలుం డుద్ధతచోడభూధవచమూవారాశి మంథాచలా
భీలప్రక్రియఁద్రచ్చి తత్ప్రమథనావిర్భూత సంపత్తితోఁ
గేలంగేల్గదియించితెచ్చె జయలక్ష్మిన్ వీర్యశుల్కంబునన్

అతనికుద్భవించె నతిలోకశూరుండు
ప్రోలనామకనృపపుంగవుండు,
అన్నరేంద్రుపేరు విన్నంతఁ దలవంచె
బుసలుకొట్టునృపతిభోగికులము

చక్రకూటంబు నిర్వక్రంబుఁ గావించి
భద్రంగనరనాథు భంగపఱిచి
కొంకణభూపాలు కొమ్ము లుడుల్చి పించి
కొడవర్తిదుర్గనికొడుకుఁగూల్చి
యరిభూపకులనెల్ల నరిగాఁపులం జేసి
యభియాతినృపతుల యదటుమాన్చి
చాళుక్యభూపతిత్రైలోక్యమల్లున
కొప్పించి యాటేనిమెప్పుఁగాంచి

బేతరాజాత్మజుం డరిభీకరుండు
ప్రోలభూపతి శాసనపూర్వకముగఁ
బడసెఁద్రైలోక్యమల్ల భూపాలువలన
నాధిపత్యంబుతోఁగూడ హనుమకొండ

ప్రోలునివెన్కనవ్విభుని పుత్రుఁడురెండవ బేతమేదినీ
పాలుఁడు బాలుఁడౌట నరిపార్థివులన్ విరియాల యెఱ్ఱభూ
పాలుఁడు కామసానియుఁగృపాణముఖంబులపాలుచేసి రా
భీలరణంబునన్ విజయభేరులు దిక్కుల ప్రక్కలింపఁగన్

ఆ విరియాల దంపతుల కాత్మజకల్పుఁడు బేతరాజుకున్
యౌవనలక్ష్మితోనుదితమయ్యెఁ బరాక్రమధైర్యశౌర్యవి
ద్యావినయాదికంబఖిల, మాంధ్రవసుంధర యిచ్చమెచ్చి తాఁ
గైవసమయ్యె నవ్విభుని ఖడ్గమహోగ్రపరశ్వధంబులన్

త్రిభువనమల్లుఁడన్ బిరుదరిందముఁడాఱవవిక్రమార్క భూ
విభుఁడు చళుక్యవంశజుఁడు విక్రమచిహ్నముగా ధరించె, నా
ప్రభువుననంతరం బది పరశ్వధభీకరజామదగ్న్యస
న్నిభునివరించె బేతధరణీధవుఁ గాకతివంశదీపకున్

మాళవాధీశ్వరుని మచ్చుమాపినాఁడు
చోడరాజన్యు మట్టిమల్లాడినాఁడు
శౌర్యసూచక విక్రమచక్రిబిరుద
భూషితుండైన యాబేతభూవరుండు

ఇమ్మడిబేతభూరమణుఁ డేలినపిమ్మటఁ దత్తనూభవుం
డిమ్మడిప్రోలనామకమహీవిభుఁ డూర్జితుఁ డుగ్రసంపరా
యమ్ములవైరిభూవరుల నాహవదోహలులైనవారి రా
రమ్మని బాహువిక్రమ పరాజితులం బొనరించె ప్రేల్మిడిన్

శైలసముచ్ఛ్రితోగ్రమదసామజసంస్థితుఁడైన శాత్రవుం
డైలపదేవు నుద్ధతు క్షణంబున బద్ధునొనర్చి, పూర్వభూ
పాల చళుక్యలబ్ధవిభవంబుఁదలంచి, కృతజ్ఞుఁడౌటచేఁ
బ్రోలుఁడు ప్రోలికిందిరిగిపొమ్మని ముక్తునొనర్చె నాతనిన్

మానధననరేంద్రు మంధన్యగుండని
ముండితుని నొనర్చి గుండెమీఁదఁ
గ్రోడముద్రవైచి గూబలుమెలివెట్టి
బుద్ధిఁగఱపి పంపెఁ బ్రోలరాజు

అతఁడు గోవిందరాజు నుగ్రాహవమున
గెలిచి యసువులఁగొనకుండ గెంటివైచి
యతని వర్ధమానపురరాజ్యాధిపత్య
ముదయచోడనరేంద్రునకొప్పగించె

హనుమకొండదుర్గంబు సమాక్రమింప
ముట్టడించి జగద్దేవభూమిపాలుఁ
డలవిదప్పి వచ్చినత్రోవనరిగినాఁడు
ప్రోలు చొరఁబాఱవచ్చునే ప్రోలుఁడుండ

ముప్పమదేవి సర్వగుణభూషిత పట్టపురాణిగాఁగఁ బ్రో
లప్పకుసర్వసంపదలులప్పలుఁగుప్పలుఁగాఁగ, భూపతుల్
కప్పపుఁబాళెగాండ్రగుచుఁగాన్కలొసంగ దిగష్టకంబునన్
గప్పనఁబ్రాఁకెఁ గీర్తిలతికాసుమసౌరభసాంద్రవీచికల్

ఆరాజన్యునకుద్భవించిరి గిరీశారాధనాతత్పరుల్
ధీరోదాత్తులు రుద్రదేవుఁడు మహాదేవుండునా నాత్మజుల్
శూరోత్తంసు లనంగరూపులు జగజ్జోఘుష్యమాణప్రదా
నీరంధ్రాఖిల దిక్తటాంచల నరీనృత్యత్పతాకాంశుకుల్

ప్రోల భూపతి వెలనాటి చోళుఁదాఁకి
వీరభోగాను భూతికై వీడెఁ బుడమిఁ
గాలగతులు తప్పింప శక్యంబుగాదు
ధాతకేనియు నాతని తాతకేని

ఆనువంశిక క్రమమున హనుమకొండ
పాలకుండైన రుద్రదేవక్షితీంద్రు
రాజ్యకాలము మనతెన్గురాష్ట్రమునకు
గణనకెక్కిన మేలిబంగారుయుగము

గోదావరీతీర కురువపట్టంబేలు
మేదినీవల్లభు మేడరాజు
ధర్మపుర్యాది భద్రగిరీంద్రపర్యంత
దుర్గపాలకుఁడగు దొమ్మరాజుఁ
బొలవాససీమకుఁ బుడమి యేలికయైన
మైళగి నామకమానవేంద్రు
నరియప్పనము సేయ ననుమతింపకనిక్కు
సామంతభూపాలసమితిఁబట్టి
బాహుబలమున నిర్జించి పాఱఁ దోలి
రాజ్యలక్ష్మిమతల్లిని రత్నఖచిత
రుక్మసింహాసనమునఁ గూర్చుండఁబెట్టి
భక్తినర్చించె రుద్రదేవప్రభుండు

మున్ను వర్ధమానపురపాలు గోవింద
రాజుఁదఱిమి ప్రోలరాణ్మహీంద్రుఁ
డొసఁగినట్టి రాజ్య ముదయ చోళనరేంద్రుఁ
డేలినాఁడు వయసుప్రాలు దనుక

భీమగోకర్ణు లుదయభూభృత్తనూజు
లందుఁదొలివాఁడు మలివాని హతునొనర్చె;
నదుపు నాజ్ఞయుఁ దప్పిన మదపుటేన్గు
ప్రజలఁ బీడింపఁ దొడఁగె నప్పాలసుందు

కనులకెగఁదట్టి ముదిరిన కావరమున
సర్వసర్వంసహాలోకచక్రవర్తి
తానెయని నెమ్మనంబునఁ దలఁచుచుండుఁ
జీరికిం గొననొల్లఁడు వీరరుద్రు

జనకుఁడుదయచోడ మనుజేంద్రుఁడాధూర్త
నాఁగఁజాలనట్టియనదయగుటఁ
గాకతీంద్రుకరుణఁ గాంచినరాచటి
కంబుఁదలఁచి యెడఁదఁగలఁగుచుండు

భీమచోదునిపీడచేఁ బిప్పియైన
ప్రజల మూఁకరోదన చెవిఁబడ్డనాఁడె
కాకతీయుల మొగసాలగవనికెలన
మొరసెఁబ్రస్థానభేరి యంబరముప్రిదుల

మానితు లిందులూరిపెదమల్లనయుం బినమల్లనార్యుఁడ
మ్మానవనాథుమెప్పుఁగనుమంత్రులు తంత్రము నిర్వహింప, సే
నానులు బేతిరెడ్డియును నామిచమూపతి కాటరెడ్డియుం
బూనిరి వర్ధమానపురి ముట్టడికిన్ సముదగ్రసేనలన్

కొమ్ములతోడనున్న నడగొండవిధంబున సేనకగ్రభా
గమ్మున మత్తకుంజరము కాకతిరుద్రవిభున్వహింప, నొ
క్కుమ్మడి వందిమాగధముఖోద్గతముల్ జయశబ్దపూర్వగ
ద్యమ్ములు పంచశబ్దములు నాకసముంగబళింపనుద్ధతిన్

సేననడచె, వర్ధమానంబు గవ్యూతి
మేరనుండ యుద్ధభేరిమొరసె
పటహకాహళములు పణవశంఖంబులు
దిక్కులొక్కపెట్ట వ్రక్కలించె

ఆభేరీ నినదంబు మారుతతరంగావృత్తమై వప్రపా
తాభీలంబయి కాననాచలగుహాహర్యక్షగర్జార్భటీ
శోభాతస్కరమై విశంకటగతిం జోడోదయేశ శ్రవో
నాభింజొచ్చెఁ బరేతరాణ్మహిష ఘంటానాదలుంటాకమై

కందూరూదయచోడభూపహృదయగ్రంథుల్ విదీర్ణంబులై
బంధవ్రాతముద్రెవ్వఁ, గన్నుఁగవటెప్పల్ నిర్నిమేషస్థితిం
జెందన్, మారుతపంచకంబెగసి తజ్జీవత్వమోక్షప్రదా
నందాపాదకమయ్యె రుద్రమననాంతశ్శుద్ధబుద్ధాత్మకున్

పామరసభయందుఁ బ్రాగల్భ్యమొలికించు
పండితంమన్య జల్పాకుమాడ్కి
ముక్కిడిమెకములమూఁక కేలికవోలె
నిక్కి నీల్గెడి గుంటనక్కపగిది
నంగనాజనముల ముంగడ మగఁటిమి
వాచాఁచి వర్ణించు కోఁచకరణి
తనయింటిముంగిలి దాఁటక తెరువరిఁ
గని బిట్టు మొఱఁగెడి శునకమట్లు

రుద్రదేవక్షితీంద్ర పరోక్షమందు
రజ్జులాడిన భీమధరావిభునకుఁ
దద్రణోద్యోగ భీకరోపద్రవంబు
విన్నమాత్రన మనమున వెఱ్ఱులెత్తె

కాకతీంద్రుఁడు ఘోరఖడ్గాంచలంబునఁ
దనయుత్తమాంగమ్ముఁ దఱిగినట్లు
గళనాళముంబట్టి కంఠదఘ్నంబుగాఁ
గోష్ణరక్తము నక్క గ్రోలినట్లు

కాకగృధ్రంబులు కండలింతింతగాఁ
జించి యాపోవ భక్షించినట్లు
పుండ్రేక్షుఖండంబుఁ బోలెఁ గోలెమ్ముకఁ
దెమలిచి శునకంబు నమలినట్లు

కన్నులంగట్టినట్లైనఁ గంపమడర
ముచ్చెమటగ్రమ్మి నిలువున ముంచియెత్త
గజగజవడంకి తడబడి కాళ్ళుపెనఁగ
భీమచోడుని నాలుక పిడుచగట్టె

తనతోడిదే లోకమని నమ్మి కొలిచెడి
బంధుమిత్రులకంటఁ బడకయుండ
మార్తుర బలముతో మార్కొనఁదలపోయు
పడవాళ్ళఁ బల్లెత్తి పలుకకుండ
శీలసంరక్షణ చింతాకులంబైన
శుద్ధాంత మట్లెత్తి చూడకుండ
నసువులవీడిన యయ్యుపీనుఁగునైనఁ
గన్నెత్తియొకమాఱుగాంచకుండ

బ్రదికియుంటిమేని బలుసాకుఁదినవచ్చు
రాజ్యమేల నాకురమణులేల
యనితలంచి భీమజనపాలుఁడడవులఁ
దూటిపాటె భీతి తోడుగాఁగ

వచ్చినరాకతోఁ బిడుగుపాటున భీమనృపాలు ప్రోలికిం
జిచ్చురగిల్చి యప్పురముచెంగటి సుందరనిష్కుటంబులం
గ్రొచ్చి తటాకమేర్పఱిచి కోటనగల్చెఁ బురారి యీగతిం
జిచ్చఱకన్నుడాఁచి దయచేసెనటంచుఁబ్రజల్ నుతింపఁగన్

ఆర్తులకు రుద్రభూనాథుఁడభయమొసఁగి
గోనవంశోద్భవుండు సద్గుణయుతుండు
క్షేమభూపాలు నటఁబ్రతిష్ఠించి చెలఁగి
యచటనెత్తించెఁ దనవరాహధ్వజంబు

ఉదయచోడరాజన్య ననూఢదుహిత
భీమచోడుని సోదరిఁ బితృవియోగ
దీనమూర్తిఁ బద్మావతీదేవి నూఱ
డించి రుద్రుఁడు రాణిగావించి కొనియె

అతఁడు తనవీట రుద్రేశ్వరాలయం బ
పూర్వ శిల్పలక్ష్మీమణిముకుర మనఁగ
వేయికంబాల వెలయించె, వేయికనులఁ
జాలవీక్షింప నాకళాసాగరంబు

శైవుఁడయ్యును తనమతసామరస్య
పాలనార్థము వాసుదేవాలయంబు
సూర్యదేవాలయంబు నచ్చోటఁగట్టె
నతుల శిల్పాభిరామ విన్యాససరణి

శ్రీరామేశ్వరదీక్షితాత్మజసుధీశ్రేష్ఠుండవింతేంద్రుఁడుం
బేరుంబెంపుగడించికొన్నబుధుఁడౌ వెల్లంకిగంగాధరుం
డారాజన్యుఁడుమూదలింప బహుశాస్త్రార్థంబులం గోష్ఠులన్
సారస్యాంచితకావ్యచర్చలనటన్ సాగింతు రశ్రాంతమున్

# ద్వితీయ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

అంతట నొక్కనాఁడు సకలాగమవేదులు వాస్తుశాస్త్రసి
ద్ధాంతులు యుద్ధతంత్రవిషయజ్ఞు లమాత్యవరూధినీపతుల్
ప్రాంతములందుఁగొల్చి యుచితాసనసుస్థితినుండ రుద్రభూ
కాంతుఁడువల్కె వారలమొగంబులఁ జూడ్కులు విస్తరించుచున్

కోరివరించిరీ యనుమకొండఁ బురాతన కాకతీయ ధా
త్రీరమణుల్ తదాది సముదీర్ణమహావిభవాభిరామమై
వీరగణాగ్రగణ్యులకు వేదికయై మనరాజధానియై
వైరినృపాలమానమదభంజకమై విలసిల్లు నేఁటికిన్

నాఁటికి నేఁటికిట్లు పరిణామదశోన్ముఖరాజ్యలక్ష్మికిం
దీటుగ రాజధానిపరిధిన్ సవరింపకయున్న నెన్నఁడేఁ
జేటుఘటిల్లు, నీ కొఱవిసీమకుఁ జాలిన రాజధాని ని
వ్వీటికిమాఱు కట్టఁదగు వేఱొకచో నకుతోభయంబుగన్

పరిసరభూములేలు పరిపంథిగణంబొకరీతిలోఁగుటన్
విరిసినరాజ్యసీమ లరివీరులతాఁకున కోర్వనేర్చునే?
కరితురగాదులుం దగినకాల్బలమింతకు మున్మ్మడుంగుగాఁ
బెరుఁగకయున్నచోఁ దగినవీడును దుర్గముఁ గల్గకున్నచో

కొంపకాలువేళఁ గూపంబుఁ ద్రవ్వుట
రీతిగాదు రాజనీతిగాదు
ముందుచూపుగలిగి మందిమార్బలముఁ
గూర్చుటేఁడు పగఱనోర్చిగెలుచు

పొరుగు పొలిమేర యాదవ భూధవుండు
పక్కలోబల్లెమై చలపట్టి యుండె
నెపుడు పైనెత్తివచ్చునో యెఱుఁగరాదు
వచ్చెఁబో నిల్వరింపఁగ వశమె మనకు?

అట్లుగాన నభేద్యమైయమరుదుర్గ
మందె సర్వాంగసంపన్నమైన నగర
మిటకు గవ్యూతి దూరమం దేకశిలకుఁ
జుట్టికొని యుండులాగునఁ గట్టుటొప్పు

అదియటుసాగుచుండ మనయంకెకురాక పెనంగువైరులన్
సదమదముంబొనర్చి చిరసంభృతమైన తదీయరాజ్యముల్
మదగజవాజివిత్తమణిమండనపూర్వకమైన సర్వసం
పదఁదరలింపవచ్చు బహుభంగుల మేలొనఁగూడు నీగతిన్

ఇది నాయెఱిఁగిన తెఱఁగుఁ
బదిమందియుఁ దద్చి దీని బాగోగులు మీ
మదినున్నపగిదిఁ బల్కుఁడు
కొదుకంజనదిట్టియెడలఁ గోవిదతతికిన్

అని కొలువుంగనుంగొను జనాధిపునెమ్మనముంగ్రహించి మ
ల్లనసచివాగ్రగణ్యుఁడనె నల్లన సస్మితమైన యాననం
బునఁదనయింగితంబు వెలిపుచ్చుచుఁ గ్రేవల నోలగంబుఁగ
న్గొనుచుఁదదాశయంబు నొకకొంత పరించుచున్నకైవడిన్

జయము! మహాప్రభువుల యా
శయములకున్ వంకదిద్దఁజాలిన యొజ్జన్
నయకోవిదుఁగంటిమె? సం
శయముందునె మిమ్ముఁబోలు సర్వజ్ఞులకున్

ఇది యిటుసల్పుఁడంచు మమునేలినవారొకయానవెట్ట కీ
మృదుసరణిన్ వచించుటది మీకతగున్ మనుజేంద్ర! సంతతా
భ్యుదయపరంపరానుగత ముత్తమనీతిపథానువిద్ధమై
యొదవిన మీవచస్సరణి యొప్పు శుభోత్తరసంవిధానమై

పెక్కుతెలుఁగువిరుల నొక్క సూత్రంబున
గ్రుచ్చుపగిది, నొక్కకొలికి కెల్ల
సిరులఁదేరఁజాలు నెఱవడి మీపల్కు,
కార్యసాధనకిఁకఁగడఁగు టొప్పు

ఇట్లు తేలఁబలుకు నిందులూర్మిల్లన
మాటకలరి సభ్యమండలంబు
హర్షపూర్వకముగ నామోదముద్రలు
తెలిపినంత రుద్రదేవుఁడనియె

సకల సమ్మతమగుఁగాన జాగులేక
యోరుగల్లుపురంబు నయోధ్యసరణిఁ
దీర్చిదిద్దుట కనువగు తెలుఁగులెంచి
చక్కఁబెట్టఁగడంగుఁడీ సచివులార!

తాళదఘ్నపరిఖ సాలోచ్ఛ్రితము సాల
మభ్రభేలిహాన హర్మ్యపంక్తి
శత్రుదుర్నిరీక్ష్యసమరతంత్రపటిష్ఠ
దుర్గమున్ననృపతి దుర్జయుండు

కరితురగాదిశాలలును గాల్బలముల్ నివసించుగేహముల్
పరిజనవాసముల్ నృపసభాభవనంబులు నాతిథేయమం
దిరములు రాణివాసములు దేవళముల్ కవిపండితాళికిన్
సురుచిరహర్మ్యముల్ వెలయఁజూడుఁడు తన్నగరాంతరంబునన్

ఆయుధశాల కోశగృహ మంబరచుంబినృపాలసౌధముల్
తోయసమృద్ధియున్ వెడఁదత్రోవలు పౌరవినోదశాల ల
త్యాయతనిష్కుటంబు విపులాపణవైద్యవిధాన సర్వసౌ
ఖ్యాయతనంబుగా నగర మయ్యమరావతి మించఁగా వలెన్

అనవిని సచివాగ్రణి మ
ల్లన యల్లనవ్వి యిట్టులనె మఱచితిరే
మనుజేశ్వర! వారవధూ
జనవాటిక కలదుగాదె జంభారిపురిన్

ధరణీవిభుఁడనెనగుచున్
సరిసరి సరసుండవగుదు సచివాగ్రణి! భూ
సురులే తగుపాత్రముగద
సురభోగంబులకు నౌరసులుగద మీరల్

అందికొనె మంత్రి ధరణీ
బృందారక సార్వభౌము లేలినవారే
ముందుగఁ దాంబూలాదిక
మందికొనందగుదు రొరుల కర్హతగలదే?

అనవిని పార్థివుఁడిట్లనె
మనప్రెగ్గడ సమరతంత్రమంత్రంబులతో
మనసిజసంగరతంత్రం
బునఁ బరిణతుఁడౌ కళాప్రపూర్ణుఁడు గాడే?

మీరు వలచుపనికి మేము కాదననేల?
వలయుపగిది నదియు వెలయుఁగాక
మనసుపొరలలోని మర్మంబెటింగెడి
సూక్ష్మబుద్ధి పుట్టుసొమ్ము గాదె!

పార్థివుండు ప్రెగడ పరిహాస సూక్తుల
నొకరి నొకరు మీఱ నుల్లమలరఁ
గుసుమశరుఁడువిసరు క్రొవ్వాఁడి తూపులఁ
గొలువు నవ్వుఁబువ్వు లొలుకఁబోసె

# తృతీయ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

నాఁటి కల్యాణి చాళుక్యనాధుఁద్రుంచి
పీరమెక్కినబిజ్జలుఁ బిలుకు మార్చి
జైనమున్ మట్టిమల్లాడి జనపదమున
నెత్తె వీరశైవము బసవేశ్వరుండు

కాలుదట్టి చెలఁగి కర్ణాటహొయసల
రాజ్యసీమ లదర అంకెలిడుచు
విశ్రమింపకడరి వీరశైవగురుండు
బసవఁడెల్లదెసలఁ బర్వులెత్తె

కులములందెచ్చులొచ్చులు పలుచఁబడిన
నంతకంటె మతోన్మాద మదుపుదప్పి
ధాత్రిమానవకోష్ణరక్తస్రవంతి
జలకమాడించిపుచ్చె మచ్చరము రెచ్చె

మతముపేరఁ దొరఁగు మానవరుధిరంబు
బలిమిఁగ్రోలలేని భారతాంబ
గర్భగోళమెంతగగ్గోలు వెట్టినఁ
దలఁకఁబోరు ధర్మతత్త్వవిదులు

ఎవ్వఁడే మానవుండు తానిచ్చగించు
మతముఁ జేపట్టఁదగు, నన్యమతము మీఁద
నిప్పకలువోయురీతి మన్నింపఁజనదు
పరమతద్వేష మతిఘోరపాతకంబు

బౌద్ధమతంబుఁగొన్న జనపాలుఁడు రాష్ట్రమునం బ్రజాళిపై
బౌద్ధముమోపు, జైనుఁడగు పార్థివుఁడాతనిగెల్చి జైనసం
బద్ధులఁజేయుఁ దజ్జనుల, వైష్ణవ శైవమతావలంబు లా
పద్ధతి కీడ్తు రిట్టిపరిపాటి నలంగి రమాయికప్రజల్

ఒప్పనివారి చర్మముల నూడ్చిరి మాడ్చిరి మేనిశల్యముల్
పిప్పియొనర్చి రిద్ధరణిఁ బీనుఁగుపెంటొనరించినారు పో
చెప్పెడిదేమి నాఁటి మతజీవులొనర్చిన ఘోర కృత్యముల్
కుప్పలుఁదెప్పలై కడకుఁ గూర్చిన విమ్మహి దాస్యశృంఖలన్

పండిత శిష్యులందెవఁడొ బౌద్ధగురుందెగటార్చెనంట, యా
పండినపాపమే గురునిపాలిటి శాపము గాఁగఁ, గోవిదుల్
నిండినకొల్వుకూటమున నేత్రములన్ దులిపించెఁ జందవోల్
మండలమేలు నాఁటి యొక మానవనాథుఁడిఁకేమి చెప్పుదున్

ఒక్కఁడు బౌద్ధచైత్యము మఱొక్కఁడు జైనమతాలయంబు నిం
కొక్కఁడుదేవళంబు మఱియొక్కఁడుగూలిచెసత్రశాల, నా
రక్కసిమూఁకసల్పిన దురంతములన్ మనశిల్పలక్ష్మి తా
ముక్కును మోముఁగోలుపడి మూల్గుఁ బ్రదర్శనశాలనేఁటికిన్

కూటికి గుడ్డకుంగఱవుగొట్టుమొగంబున దేవురింపఁగా
సాటిమనుష్యమాత్రునకు సాయమొనర్పని ధర్మతత్పరుల్
కాటికిఁబోవు పీనుఁగటుకాదిటుపోయినఁజిక్కు స్వర్గపుం
బాటయటంచు వావిడిచి పంతములాడుదురెంత పుణ్యులో

ముంగిటవేచియున్న యిహముందరియించెడి బాటఁగానఁడె
బ్బంగిఁ బరోక్షమోక్షమునుబట్టఁగలం డొకఁడుట్టికెక్కలేఁ
డంగదనెక్కు స్వర్గమునకన్నవిధంబున, నెమ్మెకానికిన్
మ్రింగఁగ లేదఁటే మెదుకు మీసల సంపెఁగ నూనెయేటికిన్

సర్వమతసారభూతముల్ శాంత్యహింస
లఖిలభూతదయాదిక మంతరించి
మానవత్వచిహ్నంబులు మంటఁగలియ
దానవత్వంబు బలియు మతంబుపేర

ప్రజల యభిమతంబుఁ బాటించికొందఱు
నృపులు సామరస్యఁరీతిఁజనిరి
మతదురాగ్రహమున మనుజేశ్వరులు కొంద
అన్యమతమువారి నడఁచినారు

జైన మడుగంటఁగా రుద్రచక్రవర్తి
శైవమతమాదరించెఁ దజ్జనపదమున
నాఁడు తక్కిన దక్షిణాంధ్రంబునందు
వైష్ణవప్రాభవము వేయిపడగలెత్తె

పశ్చిమచళుక్యనాథుల ప్రతినిధులుగ
హైహయాన్వయుల్ చౌరఁబాటిరాంధ్రధరణి
నలుగురాజిల్లటపుటల్లుఁడయ్యె నల్ల
నాఁటివెలనాటి గొంకభూనాయకునకు

అనుఁగుఁగూఁతురుమైలమ కరణమొసఁగి
నాఁడు గొంకవిభుండు పల్నాటిసీమ
అలుగురాజేలెఁ దద్రాజ్య మతనిప్రెగడ
దొడ్డనామాత్యుతంత్రంబు తోడుగాఁగ

అలుగురాజచంద్రుఁడు దివికరిగినంత
గద్దెనెక్కె జ్యేష్ఠుఁడు నలగామరాజు
మూడు పూలాటుకాయలై నాడు వెలసె
బ్రహ్మనాయని పలుకు దురాయికతన

అఖిలరాజ్యతంత్రజ్ఞయు నావులింపఁ
బ్రేగులెంచెడి యార్వెల్లినాగసాని
కల్లకసటెఱుఁగని నలగామరాజు
మానసము కైవసముగొని మంతుకెక్కె

రాజు లోపడెఁగాని చక్రంబుఁ ద్రిప్ప
ననువుపడదు రేచర్లబ్రహ్మన్నకతన
రెడ్డినాగమ్మ గొంతునఁబడ్డ పచ్చి
వెలఁగయ్యై యడ్డపడఁజొచ్చె వెలమమంత్రి

జైనసౌగతముల యవసానవేళ
విక్రమింపఁగఁజొచ్చిన వీరశైవ
మచటనెలకొన్నవైష్ణవ మగ్గలించి
బ్రగ్గనందాఁకెఁబలనాటి రాజ్యమందు

బ్రహ్మనాయఁడు చేపట్టె వైష్ణవంబుఁ
గులవిభేదములంగల క్రుళ్ళురోసె
సకలకులములదాకొల్పెఁ జాఁపకూటి
కదియె నాగమ్మచేతి బ్రహ్మాస్త్రమయ్యె

"వైష్ణవంబుపేర వర్ణసాంకర్యముఁ
బ్రజలకలవరించె బ్రహ్మనాయఁ
డిట్టిధర్మపీడ నెట్లుపేక్షింతురు
కలిపురుషుఁడు జగతిఁగాటువేసె"

అనుచు రేబవళ్ళు నార్వెల్లి నాగమ్మ
కచ్చెఁగట్టి ప్రజల రెచ్చఁ గొట్టి
యూరునాడు వల్లె లొక్కకొల్కికిఁ దెచ్చెఁ
బడఁతిరేఁగఁ ద్రాఁచుపాము గాదె?

అంతటితో నాఁగక భూ
కాంతుని చెవినిల్లుగట్టి కైలాటమునన్
వింతలగు కొండెములతో
స్వాంతంబున నూటిపోసె హాలాహలమున్

నలగామునకుం దమ్ములు
మలిదేవులమీఁదఁ బనికిమాలిన కొండెం
బులనెక్కఁబొడిచి సిగలన్
మెలివైచెం జిక్కుముడుల నేరిమివెలయన్

అదనెటిఁగి బ్రహ్మనాయఁడు
మొదలంటం గత్తిరించి ముడులఁ దొలంచెన్
అదివా రిదిమీరుం గొని
బ్రదుకుండని పల్లెనాడు పాళ్ళొనరించెన్

నలగాముఁడు గురజాలన్
మలిదేవకుమారులెల్ల మాచెర్లపురిన్
నెలకొని యిరుపాయలుగాఁ
బలనాటికిఁ బ్రభుతఁగాంచి పరిపాలింపన్

నాగసానియొకట బ్రహ్మనాయఁడొకటఁ
దివిరి నలగామునకు మలిదేవులకును
రాజ్యతంత్రమంత్రాంగ చక్రములఁ బట్టి
పన్నఁదొడఁగిరి మొన పరస్పరజిగీష

రాణకెక్కిన మలిదేవరాజ్యమెల్లఁ
గోడిపోరునఁ గికురించి కొలుపుచ్చి
బ్రహ్మనాయని మల్దేవపార్థివులను
వలసకంపించి నాగమ్మ ప్రజ్ఞఁజూపె

గడువుదీఱినంతఁ బుడమికై మల్దేవు
లన్నకడకు దూతనంపినారు
రాజ్యభాగమీక ఱవఱవలెసకొల్పి
కయ్యమునకె జాణ కాలుద్రవ్వె

ప్రజల శైవమతముఁ బట్టించి నాగమ్మ
యాలమునకు సాయమడుగనంపఁ
గాకతీయవిభుఁడనేకవిధంబులఁ
ద్రచ్చిత్రచ్చి తుదకుఁదలఁచెనిట్లు

వెలనాటి చోడుఁడేకద
చలమున మత్తాతపాదుఁ జక్కడిచెన్ నేఁ
దలఁదఱుగనేని వానిం
దొలంగదు పితౄణమనెడి దోసము నాకున్

వెలనాటి కిల్లటీంద్రా
పలనాటి నరేంద్రులిపుడు పగతై యిరువాఁ
గులుగా ననికిఁగడంగిరి
తలఁపశుభోత్తరముగాఁగ దైవమ కూర్చెన్

సుందోపసుందులట్లా
క్రందుకలన వారు వీరు కాలునిపురికిన్
విందులయి చనుట తప్పదు
కుందున్ వెలనాటి ఱేఁడు గొంకఁడు చిక్కున్

ఆయిరుదెసలంజూడఁగ
నాయఁడసాధ్యుండు సమరనరసింహుం డా
నాయకురాలబలయగుట
సాయంబొనరింపఁదగవు శైవుల మగుటన్

ఇట్లు తర్కించి రుద్రనరేశ్వరుండు
వేయిగుఱ్ఱాలదండును సాయమంపె
గరితనాగమ్మఁ బట్టఁబగ్గాలులేవు
దండు కారెమపూఁడికిఁ దరలిపోయె

ఒడయఁడనదయగుట నుదిదపెత్తనమౌటఁ
బగ్గెసాగకుంట బ్రహ్మనాయఁ
డొడుగటవి కడఁగె నాలంబునకుఁదుద
కింతికతననొదవె నింతచేటు

వారు వీరు మొనసి కారెమపూఁడిలోఁ
బోరిమడిసిరి మగపురుగులేదు
నాఁటి పల్లెనాట, నాయఁడొక్కండె తాఁ
గోరిచొచ్చె సుత్తికొండబిలము

అశుభవార్తలు పర్విన
వాశుగములరీతి నప్పుడపుడేకశిలా
ధీశుకడకుఁ దన్మనమున
నాశలు చిగురెత్త నాతఁడాలోచించెన్

పల్లెనాడాలగోడును బాలగోడు
నైనతటి నెత్తిపోవుటర్థంబుగాదు
చిచ్చుదరికొన్నయదనున ముచ్చిలింతఁ
బాలసుఁడుదక్క మెచ్చఁడు ప్రాజ్ఞఁడెవఁడు

దేవగిరి యాదవేంద్రుఁ డాదిక్కునందు
మింటఁబెట్టినదీపమై మిడిసిపడుట
వేగువచ్చుటవింటిమి వేగిరింత
తగదు కొంతకాలముదాఁకఁ దాళుటొప్ప

ఏకశిలానగరంబును
ప్రాకారంబును నగడ్త బంధురభంగిన్
సాకల్యం బొనరింప వి
వేకంబగుఁగాని వేఱు విధమేమిటికిన్

ఇట్లు చింతించి యమ్మేదినీశ్వరుండు
కతిపయవసంతముల నోరుగంటి దుర్గ
మరిదురాసదముగ సమాయత్తపఱిచి
వృద్ధిగావించెఁ దనసైన్యయుద్ధపటిమ

ఒక్క శుభముహూర్తంబున నోరుగల్లు
నగరమున శైవసమ్మతామ్నాయవిహిత
మార్గమునఁజొచ్చి కాకతిమనుజవిభుఁడు
కాలముం బుచ్చుచుండె సత్కావ్యగోష్ఠి

# చతుర్థ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

సప్తపర్ణమహీరుహశాఖలందు
శశిదివాకరతారకాసముదయమున
గంధదంతావళంబుల గండసీమ
సిరులనించి శరల్లక్ష్మి చెలఁగెనపుడు

పూర్ణిమాచంద్రమో బింబమోహనాస్య
తారకానిర్నిమేష సుందరతరాక్షి
తఱపివెన్నెల ముసుఁగునఁదనరు రాత్రి
యొప్పె వలిపముఁదాల్చిన యువిదవోలె

గళితకిల్బిషు నంతరంగంబు రీతిఁ
ద్యక్తజీమూతమయ్యె వియత్తలంబు
బంధనిర్ముక్తజీవుల పగిదివెలసె
రాచబాట లాశ్యానకర్దమము లగుచు

వినయలజ్జావిధేయలౌ వెలఁదులట్లు
నదులు ననుకూలవర్తన నొదిగి సాగెఁ
బరిహృతాఘమౌ సాధుజీవనముకరణి
జీవనము తేఱుకొని శౌచసిద్ధిఁ గాంచె

ఏదియొటైననేమి? మనకిప్పుడుదాపరమైనయాపదన్
కాదనఁబోవునే? రిపులఁగ్రచ్చఱఁ జెండినఁగాక, విద్విషత్
సూదనులై పరాక్రమయశోధనులై వెలనాటి గడ్డపై
బాదముమోపు శాత్రవులఁబట్టివధింపఁ బ్రతిజ్ఞఁబూనుఁడీ!

చందవోల్పురంబు చాయకురాకుండఁ
దఱిమి కొట్టవలయు నరిబలంబు
ననుచు గొంకనృపతి యాలంబునకు సమా
యత్తపఱిచె నప్రమత్తబలము

అక్కడఁగాకతీయపృతనాధిపతుల్ రణకౌతుకంబునన్
దిక్కరిసన్నిభంబగు ననేకపమొక్కఁడు వన్ని క్రోడపుం
డెక్కెమునెత్తి రుద్రధరణీధవుచెంగటనిల్వ భూవిభుం
డెక్కె మహోత్తరంబగు మహీధరమేలు కపర్దికైవడిన్

అహితరాజన్యజీవాపహరణ దీక్షఁ
గాసరేంద్రాధిరూఢుఁడౌ కాలుపగిది
నంజనాద్రినిభంబెక్కె గుంజరంబు
వీరసింహుఁడు రేచర్లబేతిరెడ్డి

నామిరెడ్డి తురగచమూనాయకుండు
నపుడు దోతెంచెఁ బారశీకాశ్వమెక్కి
కలియుగాంతంబునందుఁ గంఖాణమెక్కి
ఖడ్గహస్తుఁడై పఱతెంచుకల్కి వోలె

కదనగాండీవి రేచర్లకాటరెడ్డి
కింకిణీజాల మాలికాలంకృతంబుఁ
జటుల కాంభోజ సుందరాశ్వంబు నెక్కి
కాల్బలంబులు తనవెంటఁగదల వచ్చె

కుంతఖడ్గపరశుకోదండతూణీర
ధారులైన యోధవీరవరుల
కాల్బలంబు గదలెఁ గడలిపొంగినభంగి
సింహనాదముల్లసిల్లుచుండ

నింగికురిసినట్లు నేలయీనినలీలఁ
గాకతీయబలము కదలిపోయి
ప్రొద్దుపొడుపువేళ ముట్టడింపఁ దొడంగెఁ
జందవోల్పురంబు సంచలింప

హుంకారంబుల భేరీ
భాంకారంబులఁ ప్రభిన్నవారణమాలా
ఘీంకారంబులను ధను
ష్టంకారంబులను నాకసము ఘూర్ణిల్లెన్

వేగువలన మున్నెవెలనాటి సైన్యముల్
సిద్ధమగుట నాఁటియుద్ధభూమిఁ
బొంగిపొరలు రుద్రభూనాథు వాహిని
నానకట్టపగిది నడ్డగించె

రుద్రుఁడు గొంకమహీపతి
భద్రకరీంద్రములమీఁద భాస్కరయుగళం
బద్రిద్వయమునఁ బొలిచిన
మాద్రిం గాన్పించిరపుడు మహనీయరుచిన్

గొంకనృపతి యనుఁగుఁగొడుకు పృథ్వీశ్వరుం
డొక్కకెలననిలిచి యుత్సహింప
విక్రమైకరాశి వెలనాటి పడవాలు
బుద్ధవర్మ యొక్క మూలఁదోఁచె

నడుమఁగొంకరాజు నక్షత్రములమధ్యఁ
బూర్ణచంద్రుకరణిఁ బొలిచినిలిచి
సింహనాదమెసఁగఁ జేవీచియెసకొల్పి
తాఁకెఁగాకతీయదళముఁబెలుచ

వలపట నామిరెడ్డి దళవాయియు దాపటఁ గోటరెడ్డియున్
నిలువఁగ బేతిరెడ్డి ధ్వజినీపతి సేనమొగానఁదోఁపఁ ద
ద్బలమున మధ్యనిల్చె నరపాల శిరోమణి రుద్రదేవుఁడా
నలువురు దిక్పతుష్క మదనాగముల ట్లెదురొడ్డి మార్కొనన్

వారువీరుదాఁకఁబోరు ఘోరంబయ్యె
నంబరమున ధూళియావరించెఁ
గీలుచెడిన బొమలక్రియవ్రాలెనిరుగడ
గజతురంగ యోధగణము పుడమి

బేతిరెడ్డిఁదాఁకె వెలనాటి యువరాజు
గొంకరాజుఁదాఁకెఁగోటరెడ్డి
నామిరెడ్డి యడరి నానావిధంబుల
బుద్ధవర్మతోడఁబోరఁదొడఁగె

ఇతరేతరకరవాలా
హతులై యుగపత్ప్రాసు లాహవభూమిన్
పతితులగుట వీరజన
స్తుతిపాత్రంబెందుఁగనని చోద్యంబయ్యెన్

దొరలెడికరులును నెత్తురు
లురలెడిజోదులును బుడమినొఱగెడిహరులుం
గరధృతకౌక్షేయకసం
చరత్కబంధములు దోఁచెసమరక్షోణిన్

అయ్యెడగొంకరాజని శితాసివిహారమునాఁగఁ జాల కా
కయ్యము చక్కివాసి వెనుకం బొడసూపిన కోటరెడ్డి తీ
రయ్యువనీంద్రు నొక్కపరియౌదల నార్చుచుఁ బాఱఁజూచి తాఁ
జయ్యనబేతిరెడ్డి రభసంబునఁదాఁకె బలంబులార్వఁగన్

బేతిరెడ్డి గొంకపృథ్వీవిభుండును
హస్తలాఘవమున నాయుధముల
బఱపిపోరి రొక్కపందికైయలనాఁడు
హరుఁడునరుఁడుఁబెనఁగినట్టిభంగి

గొంకనృపాలు వాఁడియసి కుంభముఁవయ్యాఁగఁదాఁక వారణం
బంకెకురాక యొక్కమొగినాత్మబలంబులఁ జక్కడంపఁగా
జంకినబేతిరెడ్డి యగచాట్లుగనుంగొని రుద్రదేవుఁడా
సంకటపాటునంగవిసె శౌర్యరసోజ్జ్వలుఁడైన గొంకవిన్

విక్రమోజ్జ్వలుండు వెలనాటి దళవాయి
బుద్ధవర్మయడరిపోరుచుండ
నతనియుత్తమాంగ మవనిపైఁబడఁగూల్చి
యార్చెనామిరెడ్డి యరులుదలఁక

తెగిన బుద్ధవర్మదేహంబుఁ బొడగాంచి
తద్బలంబు లెల్లఁదరలిపాఱఁ
గాకతీయబలముఁ దాఁకెఁబృధ్వీశ్వరు
నాహవంబువీడి యతఁడు పఱవ

గొంకనృపాలుఁడెంతరణకోవిదుఁడైననిఁకేమిసేయు న
ల్వంకలఁగాఱుఁచిచ్చువలెఁబైపయిఁగ్రమ్మెడి శత్రువాహినీ
సంకులయుద్ధభూమి భుజసారమెలర్పఁబెనంగ చంద్రహా
సాంకిత కంఠుఁజేసి వడి నాతని రుద్రుఁడు గూల్చెమేదినిన్

అదిగనికైదువుల్విడిచి యాహవరంగముఁబాసి సైన్యముల్
చెదరుటగాంచి తేఁడు తనసేనపురంబునఁజొన్పి భీతులై
యొదిఁగినవారి నందుఁగల యోషిదనాథుల నూఱడించి సం
పదఁదరలించిపంచెఁ బలుభద్రగజంబుల నోరుగంటికిన్

కాకతీయవిభుండు దిగ్జయముఁజాట
నచటనెత్తించెఁ దనవరాహధ్వజంబు
రాజ్యపరిపాలనార్థుఁడౌ ప్రతినిధినట
నిలిపి పశ్చిమముఖముగా బలమునడిపె

పశ్చిమాశాముఖంబునఁ బల్లెనాటి
పౌరుషాంశు స్వతంత్రతాభానుబింబ
మస్తమించుటఁజేసి యెందాఁకలేక
కడచెఁదల్సేన త్రిపురాంతకంబు దాఁక

సేననందనిలిపి శ్రీగిరీంద్రము మెట్టి
ప్రకృతి శోభకంతరంగమలరఁ
బరమపావనంబు పాతాళగంగలోఁ
గ్రుంకి దేవదేవుఁ గొలిచి నిలిచి

ఆంధ్రగీర్వాణభాషామహార్ణవములఁ
గడవనీఁదియు సంస్కృత కావ్యరచన
గణనకెక్కినవాఁడౌటఁ గాలకంరు
వినుతిగావించె రుద్రుఁడు విబుధవాణి

జటాజూటం చన్ద్రం డమరుకపినాకౌచ భుజగాన్
భవానీం స్వర్గఙ్గా మనలనయనం చర్మవసనమ్
విహాయోగ్రారణ్యాం కిమధివససిత్వం పశుపతే
శిలీభూతఃకింను ప్రణయకుపితో బ్రూహిభగవన్

భీతఃకింకుసుమేషుభీషణధనుష్టంకార శఙ్కాకుల
శ్శ్వశ్రూమన్దిరవాసమత్యనుచితం కింభావయస్యాత్మని
కింవాశైత్యనిపీడితో హిమనగం త్యక్త్వాసమాయాతవాన్
కచ్చిద్దక్షిణదేశవైభవరత శ్శంభో సమాధేహిమే

కిరాతావివాహో ప్రమధగణకృత్యా, గిరిరయం
తుషారాద్రి, ర్వన్ద్రీ విపినవిచరత్కాసరవిభుః
శివాభిల్లీమల్లీ, విబుధతటినీసహ్యగిరిజా
విపర్యస్తం సర్వం కిమితిభగవన్ బ్రూహితదిదమ్

పురాక్రోడాఖేటే ప్రతిభటనరేణాసి విజితో
నరాకీర్ణం శైలం కిమధివససి బ్రూహి భగవన్
కిరాతావాసోఽయం త్వమపి కుహనాభిల్ల ఇతియు
న్నిదానం సాజాత్యం తదిహభవదావాసవరణే

మహేశ్వరోఽసిత్వ మహంమహీశో
గిరీశ్వరస్త్వం నగరీశ్వరోఽహమ్
ఆవాముభౌ రుద్రపదాభిధేయా
వుభౌచ నాగేన్ద్రవిభూతి భాజౌ

సామ్యం సమీచీన మతః పురారే
నిరన్తరం హ్యాన్తరమేవమన్యే
మృత్యుఞ్జయస్త్వం గరళంనిపీయ
మర్త్యస్సుధాబ్ధావపి మజ్జితోఽహమ్

భవత్కృతే హ్యేకశిలానగర్యా
మాకల్పితో దివ్యనివాస ఏకః
ప్రస్థాపితస్తత్ర భవత్ప్రతీకో
జగత్ప్రియా సేవ్యవిభు స్స్వయంభూః

ప్రసీద విశ్వేశ్వర దేవ! తేజః
ప్రసార్య తత్రైకశిలానగర్యామ్
షట్కాలపూజాం సమనుగ్రహీతు
మభ్యర్థయే ప్రాఞ్జలి బద్ధపూర్వమ్

అని శ్రీశైలేశ్వరునకు
వినుతులు వినతులు నొనర్చి వెనుదిరిగిన య
జ్జననాథుఁడు తనబలములు
వెనుకొనఁగా సమ్మదమున వీటికినరిగెన్

# పంచమ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

అంత వెలనాటిపై రుద్రుండరిగినట్లు
చారచక్షువు యాదవ జైత్రపాలుఁ
డెఱింగి యేకశిలాపురి కెత్తిచనఁగ
సమరసన్నాహములనెల్లసంతరించి

బయలువెడలుట కాకతిప్రభువెఱింగి
ప్రకృతి వర్గము నిజసభా భవనమందుఁ
గొలువుదీరఁగ వారితోఁ బలికెనిట్లు
జలదగర్జితమంద్రసుస్వరము తోడ

నిన్నవెలనాటి సీమలో నెత్తురింకి
గారవట్టిన కత్తులు గడుగలేదు
దేవగిరి యాదవేంద్రునిదృష్టి యిప్పు
డోరుగల్ దెస ప్రసరించు చుంట తెలిసె

యాదవజైత్రపాలుఁడిపు డాంధ్రమహీస్థలి నోరుగల్లునం
బాదముమోపు కోరిక నపారబలంబుల నెత్తివచ్చు సం
వాదము వేగువచ్చె నొకపట్టున వానిమరల్పరాద యా
యోధనమందు గెల్చుటయొ యోడుటయో యిఁకఁదేల్చుకోవలెన్

యాదవోపద్రవంబెంచికాదెయనుజుఁ
బంపియుంటిమి గౌతమీ ప్రాంతమునకు
నమ్మహాదేవుఁడందు సైన్యంబు కలిమి
యుద్ధసన్నద్ధుఁడై కాచి యుండనోపు

కావున జైత్రయాత్రకిటఁగల్గిన సేనలతోడ నమ్మహా
దేవునకండగాబయలుదేఱుటలెస్స పురంబు దుర్గముం
గావఁగ నిందెనిల్చు మనకాటచమూపతి వెల్లనాటి సై
న్యావళిఁదోడిలెచ్చి యిదియంతయు నెల్లి పొసంగఁజూడుఁడీ

అని యానతిచ్చి కాకతి
జననాథుఁడు కొలువువీడిచనె మంత్రగృహం
బున కిందులూరిమల్లన
యునుబేతిచమూపతియును నొయ్యననడువన్

మఱునాఁడు వేగుఁబోకనె
కరిసైంధవవీరయోధగణ సహితుండై
యరిగె మహీపతి గోదా
వరిదక్షిణతీరమునకుఁ బగతురఁదాఁకన్

అంతకు మును గోదావరి
యంతికమునవిడిసె నమ్మహాదేవుఁడు ద
త్ప్రాంతమున దేవగిరి భూ
కాంతుని మార్కొనఁగ నచటి కాంతారమునన్

దేవగిరి యాదవునకిది తెలిసియుంట
సేవనిరుపాళ్ళుగావించి వానియందుఁ
బనిచెనొకపాలు తనదళవాయివెంట
రేవుదిక్కున కమ్మహాదేవుఁడాఁక

తక్కుసాఁబాలుగొంచు మంథనికి దిగువ
గౌతమిందాఁటి విపినమార్గమునవేగి
కాకతీయ పురంబుఁ గ్రక్కదలఁబట్ట
యాదవేంద్రుఁడు తానె సైన్యంబు నడిపె

ఇచట రుద్రదేవుఁ డీపన్నుగడనెల్ల
వేగువలన నెఱిఁగి బేతిరెడ్డిఁ
గొంతబలముతోడఁగూర్చి మహాదేవు
కడకుఁ బుచ్చె నరులకడఁక నడఁప

పద్మనాయకవీరులఁ బ్రథితబలుల
నిరుదెసలఁబంచి రుద్రమహీశ్వరుండు
జైత్రపాలుఁడేతెంచెడి సరణియరసి
నామిరెడ్డితోవరిగె సంగ్రామమునకు

అటమహాదేవరాజు నిజాగ్రజుండు
పంచినబలంబు తనతోడిబలముఁ గూడ
సమరసన్నద్ధుఁడయ్యెగౌతమి తటాన
దేవగిరిసేనరాఁదగు దిక్కునందు

దేవగిరిసేన దాఁటెడి
రేవున కిరుగడల నెదుట రేవంతులతో
మావంతులతోఁగాకతి
భూవల్లభుఁడర్ధచంద్రు వ్యూహముఁ బన్నెన్

ఆవలియేటిగిట్టు డిగి యాదవసైన్యము తాళదప్పు గో
దావరిభంగడోలలఁ బతాకల చాయలు నాట్యమాడ నా
రేవునఁ దత్ప్రవాహముఁదరించి తటమ్మునుడాసి యమ్మహా
దేవునియంపటున్ మునిఁగితేలి కకావికలయ్యెనయ్యెడన్

జడివానకుఁగట్టెదురుగ
నడిచెడి పసరముల వడువునన్ రిపుబలముల్
వడిచెడి మొగమెగనెత్తం
జిడిముడివడి జడిసి బెడిసి చీకాకువడెన్

చిట్టడవిపొదలలోఁ గను
పట్టక పరబలముపటుపు వాలంపటుకున్
బిట్టు గలఁగి స్వబలంబుల
మట్టాడెంజిట్టదిరిగి మత్తేభంబుల్

బాహుబలాఢ్యుఁడౌనజితవర్మఁడు యాదవసైన్యనాథుఁ డా
వ్యూహము నాకళించికొని యోధుల సాయుధులం బొనర్చి తా
నాహవదోహలుండగుచు నాశ్వికులం బురికొల్పి శత్రుసం
దోహము మార్గ్గనం గడఁగి తోఁచెమహోద్ధతిగౌతమీతటిన్

అంతగజేంద్రబృందముల నంకెకుఁదెచ్చి రణాగ్రమందు మా
వంతులునిల్వ నయ్యుభయపక్షచమూపతు లుగ్రశౌర్యవి
క్రాంతిఁబరస్పరం బభిముఖంబుగఁదోఁపఁగ జైత్రపాలభూ
కాంతుని సైన్యనాథుఁడు నికారపు బెల్గునఁబల్కె నీగతిన్

ఓహోహో! సకలరణ
వ్యూహకళాపూర్ణులైన యోజ్జలు మీరీ
యాహవమునఁ బిఱుతివియక
సాహసముం జూపవలయుఁ జక్కఁగనిలుఁడీ!

మీసలుగల్గుక్షత్రియు లమిత్రులమార్కొని యుక్కడంతు రీ
రోసములేనిముచ్చుపనిరోయకయిట్లొనరించుటెంచినన్
దాసకులోచితంబగువిధానము మీయెకిమీఁదు క్షత్రియా
భాసుఁడుగాన నిప్పనికిఁ బాల్పడెఁగాకిదివీరధర్మమే?

అన విని బేతిరెడ్డి విలయాగ్నిశిఖానిభమైన చూడ్కితోఁ
గనియనె నోరి! కన్నులకుఁగావరమెక్కినఁబ్రేలుచుంటివే?
మునుపటికాకతీయకులభూభుజులెల్లరు దుర్జయాన్వయుల్
జినమతమాదరించిన ప్రసిద్ధదివాకరవంశమండనుల్

జన్నిదమువీడినంతన క్షాత్రమెట్లు
తొలఁగు? నదిపుట్టునెత్తురుతోడఁగలుగుఁ
దులువతనమున నీనోటిదురదతీరఁ
బలుకనేటికిఁ బొమ్మిట్టి ప్రల్లదములు

సమరతంత్రమర్మంబులు క్షత్రియులకుఁ
గాక యెటులబ్బు రా! పసి కాపరులకుఁ
గయ్యమునఁ జూపుమీ మొనగానితనము
నింతలోఁ ద్రుళ్ళిపడనేల గంతులేల?

అనుచుండఁగ నిరువాఁగులు
మునుకొని కైదువులఁబూని మొనలేర్పడఁగా
ననికిం గడఁగిరి దైత్యులు
ననిమిషులున్ సుధకుఁబెనఁగి నట్టివడువునన్

ఆయోధులు నీయోధులు
నాయోధనమందుఁబెనఁగునప్పుడు విజయం
బూయెలవలెఁ జూపఱకిరు
చాయలఁగానంగనయ్యె శంకాస్పదమై

ఓహరిసాహరిఁబోరెడి
యాహవరంగమునఁగూలు హరికరివీర
వ్యూహోయుధఖండంబుల
నూహాతీతాతి ఘోరయుద్ధము సాగెన్

సేనానాయకు లిరువురు
నానాశస్త్రప్రహార నైపుణిఁబెనఁగన్
శ్యేనంబుకరణి యాదవ
సేనాపతి యజితుఁడెగసి చిచ్చులపిడుగై

బేతిరెడ్డిఁ ద్రుంచి బిట్టార్వ నోరుగల్
సేన భీతిగదిరి చెదరిపోవ
నాఁగుమాఁగుమని మహాదేవుఁడదలించి
యజిత వర్మఁదాఁకె నదటువెలయ

ఇతరేతరకరవాల
క్షతగాత్రులు నిహతఘోటకద్వయులయ్యున్
క్షితినిలిచిపోరుచుండ న
జితుఖడ్గము ద్రుంగెముందు శీర్షమువెనుకన్

ఇట్టులజితవర్మఁ డీల్గ మహాదేవుఁ
డేచి యాదవబలమెల్లఁదఱిమి
ప్రధనరంగభూమి వ్రచ్చివందఱలాడఁ
జాకమిగిలియున్న మూఁకబాఱె

ఇది యిటులుండ యాదవమహీతలపాలుఁడు జైత్రపాలుఁడా
నదినటనుత్తరించి పయనంబగుచుండఁగ రుద్రదేవుఁడు
న్మదగజఘోటకోగ్రపృతనాసహితుండయి యేగుదేరఁగా
యదునృపమౌళిగాంచి స్వబలాధిపతింగనిపల్కె నీక్రియన్

ఇతఁడు వెలనాటిసీమపైకేగెనన్న
వినుకలింగాదె మనమిట్లు వెడలివార
మింతలోవచ్చిపడునని యెంచకుంటఁ
బట్టుదప్పెఁబో మనమంత్రపాటవంబు

మనసమరప్రయత్నము సమగ్రముగా నెఱుఁగంగఁబోలు నీ
జనవిభుఁ డట్లుగానబహుసైన్యముతో నరుదెంచి మార్కానన్
జనపదసంప్రహారము ప్రజావ్యథకాస్పదమౌటయెంచి యి
వ్వనమునఁదాఁక రుద్రనరపాలుఁడు వచ్చె వివేకిగావునన్

తోటఁ దలనుదూర్చి రోఁకంటిపోటున
కులుకనేల పగఱ యుక్కడంచి
యెగురవేయవలయు నేకశిలాపురీ
ప్రాంగణమున యాదవధ్వజంబు

ఆ మాటలువిని తద్భల
మామకవిసి సంగరమున కాయితమై యు
ద్దామభుజాటోపంబున
సోమించెన్ శత్రుబలనిషూదన దీక్షన్

కాకతీయభూరమణుఁడు గాంచెనెదుట
ననికిఁగట్టాయితంబైన యాదవేంద్ర
వితతసేనాసముద్రము వెదకఁబోవు
తీఁగ కాలికిఁదగిలినతీరుదోఁప

నరవిభుండు చమూపతి నామిరెడ్డిఁ
జూచివాకొనె నదెయటుచూడు మెదుట
గౌతమీనదిగట్టుపైఁ గాలుమోపె
సమరసన్నద్ధయాదవసైన్యమెల్ల

మును మనమూహించినగతిఁ
జనుదెంచిన యాదవేంద్రుఁజక్కాడంగా
మనబలము మోహరింపం
జనుఁ దగదీసమయమందు జాగొనరింపన్

అనఁగవిని నామిరెడ్డి సైన్యంబునెల్ల
సమరసన్నద్ధమొనరించి జైత్రపాలు
బలముమార్కొన నెదురుగానిలిపి యందుఁ
దగిన తావుల నియమించె దండపతుల

పద్మనాయకసేనాని పల్లెనాటి
పౌరుషజ్యోతియని పేరుపడినవాఁడు
నడిచె దాపట బేతాళనాయకుండు
నామిరెడ్డి వలపట నెన్నడుమ నృపతి

కాకతిప్రభుండు కాంభోజతురగంబుఁ
బఱపెనపుడు జైత్రపాలుదెసకు
విజయవర్మ కవిసె బేతాళనాయకు
సోమపాలుఁదాఁకె నామిరెడ్డి

ఆజానేయంబులపై
భూజానిద్వయము పెలుచఁబోరెడితఱియం
దోజచెడి యొకఁడు పిఱుఁదం
దేజింబఱపించి రుద్రదేవుం దునిమెన్

హాహాకారము లాంధ్ర
వ్యూహంబునరేఁగఁ బట్టి యుక్కడఁపుండా
ద్రోహిననియార్చి జోదులు
వాహంబుల వానిదెసకుఁ బఱపిరివేగన్

అద్దురాత్ముఁ బొదివి యాశ్వికవీరులు
చక్కడంచి యడరిక్షైత్రపాలుఁ
బట్టఁదివుర నతఁడు వార్వంబు వెనుకకుఁ
దిగిచిపాఱెఁ గాకతీయులార్వ

సోమపాలుఁడు రేచర్లనామిరెడ్డి
భంజళీచిత్రగతుల నశ్వములఁబఱిపి
ఖడ్గఘట్టన విస్ఫులింగంబులెగయఁ
బిడుగు బిడుగును దాఁకు క్రైవడిఁబెనంగ

నామిరెడ్డి యెగసి సోమపాలుంద్రుంచి
తక్కుయాదవబల ముక్కడంపఁ
బూనినంత నతని మునుమున శాత్రవ
సేనయెల్లఁ గాందిశీకమయ్యె

ఏచి విజయవర్మ రేచర్ల బేతాళ
నాయకుండు ఖడ్గనైపుణంబు
వివిధచిత్రగతుల వెలయించి పోరిరి
పోతరమున గండుపులులపగిది

బేతాళనాయకుండొక
వ్రేఁతన్ఖడ్గంబుదునియ విజయుని శిరముం
గాతాళంబునఁ ద్రుంచెం
జేతోభీతింగలంగి సేనలుపఱవన్

దేవగిరి భూధవుఁడు తన
చేవయటులవమ్ముగాఁగ సిగ్గటి వేగో
దావరియవ్వలకరిగెం
జావఁగశేషించియున్న సైన్యముతోడన్

కాకతీయు లి ట్లుభయరంగంబులందు
దేవగిరియాదవులను మర్దించి కొన్న
విజయలక్ష్మికి నెమ్మొము విన్నఁ బోయె
భూధవుం దళవాయిఁ గోల్పోవుకతన

ఈ శుభాశుభఫలముల నేకశిలకు
మోచికొని సైన్యమేతేర రాచవీటఁ
గోష్ఠ బాష్పాంబుధారలు కురిసెగాని
విజయలక్ష్మివిలాసముల్ వెలయవయ్యె

వీరరుద్రమహీపతి వీరనాక
భువనమునకేగ నాతఁడపుత్రుఁడగుటఁ
దదనుజుండు మహాదేవ ధరణివిభుఁడు
కాకతీయరాజ్యేందిరకరముఁబట్టె

బయ్యలాంబ కడుపుపంట మహాదేవు
నాత్మసంభవుండు యౌవరాజ్య
కనకపీఠమెక్కె గణపతిదేవుండు
రాజ్యలక్ష్మి భావిరమణుఁ డతఁడు

# షష్ఠ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

అక్కడ యాదవనాథుం
డుక్కటి శాత్రవపరాభవోగ్రవిషంబుం
గ్రక్కన్ మ్రింగం జాలక
వెక్కసమగుచింతతోడ వీటికినరిగెన్

జైత్రపాలుఁడు తనమహోమాత్రమౌళి
యజ్ఞదత్తుతోఁ దనజైత్రయాత్రయెల్ల
భంగపాటుగా మాఱినభంగిదెల్పి
యుమ్మలికఁగాంచి వేఁడినిట్టూర్పుఁ బుచ్చి

అక్కట! యాదవాన్వయసుధాంబుధి నేఁటికిఁ గాలకూటపుం
జుక్కయొకండు పైకిఁబొడసూపినదివ్విధి నాకతంబునన్
దిక్కరి యూరఁగుక్కలకు దీల్పడుచందముగాదె? యాంధ్రభూ
భుక్కులకోడి యాదవుఁడు ప్రోలికిఁగ్రమ్మఱి వచ్చుటెంచినన్

అక్షయ యశస్సుధాభాండ మగలవైచి
భంగురంబగు తనువుఁగాపాడుకొంటి
నోడిబ్రదికిననాకంటె యుద్ధభూమిఁ
జచ్చిగెలిచిన రుద్రభూజాని మిన్న

అని వగచుచున్నమనుజేంద్రుననునయింప
నవ్వయోజ్ఞానవృద్ధుఁడు యజ్ఞదత్త
సచివశేఖరుఁ డారాజచంద్రుఁగాంచి
పలికె లోకజ్ఞతాభావబంధురముగ

ఇది తగునే నరేశ్వర! యుపేంద్రుఁడు ద్వాపరసంధివేళ మీ
యదుకులమందుఁ గృష్ణుఁడన నభ్యుదయంబును గాంచి ధూర్తుఁడు
న్మదుఁడగు మాగధుండు పలుమాఱులు ముట్టడికెత్త వానితోఁ
గదనముఁజేయనొల్ల కొకకాలము దాఁకఁ దొలంగియుండఁడే!

కలిమియు లేమి కష్టము సుఖంబు జయంబు పరాజయం బహో
నిలుచునె యొక్కరీతి? రథనేమివిధంబునఁగ్రిందుమీఁదుగాఁ
దొలఁగుచు వచ్చుచుంట విబుధుల్ గమనించి తితిక్షఁబూని య
క్కులగిరులట్లునిల్చి కనుఁగొంద్రు శుభాస్పదమైన కాలమున్

రాచవారికిఁ దనివి యర్థంబుగామి
జైత్రయాత్రకుఁజనుట దోసంబు గాదు
దైవ మననుకూలంబని తలఁపఁజనదు
నిన్నుఁగీడొందు సోఁకక యున్నకతన

తనకు మాలినట్టి ధర్మంబు కొఱగాదు
మొదలుచెడ్డబేర మెదుగదెపుడు
చచ్చి రుద్రుఁడేమి సాధించెఁ జెప్పుమా!
తనజయంబుఁగాంచి తనిసినాఁడె?

తానుగల్గిన నెల్లభద్రములు గల్గఁ
గానఁ గాలంబువేచి యక్ష్వాకతీయ
నిగ్రహంబునకై ప్రయత్నించుటుఅవు
వగవఁ జెల్లునె యధిప! భవాదృశునకు

మొన్నటి యాహవమున నవ
సన్నంబై తఱిగియున్న చతురంగబలం
బెన్నికకెక్కెడివిధమున
మన్నీలం గూర్చుటొప్పు మనుజాధీశా!

స్వామ్యమాత్యసుహృత్కోశసహితరాష్ట్ర
దుర్గబలములుగలవాఁడు దుర్జయుండు
సంధివిగ్రహ యానలక్షణ విదుండు
నాసనద్వైధసంశ్రయోద్యతుఁడు గెలుచు

ప్రభుమంత్రోత్సాహంబులు
ప్రభునకు సమ్యక్ప్రయోగపారీణునకున్
శుభకరములు కామగవీ
నిభములు నగుఁ బ్రత్యనీక నిగ్రహవిధికిన్

శత్రువ్యసనంబును నిజ
మిత్రాభ్యుదయంబుఁబొదలు మేలగుతఱిఁదా
యాత్రకుఁగడంగునేనిం
ధాత్రీనాథుండు త్రిభువనంబులు గెలుచున్

కడచిన దానికై వగవఁగార్యముదప్పు నరేంద్ర! తేఁడటన్
మడియుటచే నరాజకమునం బొడసూపెడి విప్లవంబులం
జెడఁదగు నోరుగంటిసిరి; చిత్తమొకించుక చిక్కఁబట్టుచుం
గడపుము కొంతకాలము సుఖప్రదమౌనదినీకు భూవరా!

అని హితోపదేశమొనరించు సచివుని
పలుకులాదరించి పార్థివుండు
సమరయాత్రకుఁదగు సన్నాహమొనగూర్చి
యెదురు చూచుచుండ నింతలోన

అచ్చట రుద్రదేవుఁడు శివైక్యము నందినవార్త నల్గడం
జిచ్చువిధంబునంగవియ సీమలయందరిగాఁపు లెల్లరున్
మచ్చరమూని యొక్కమొగి మార్కొననాయితమైరి తేనిపైఁ
గచ్చెకుఁగాలఁద్రవ్వు పలుగాకులు రేఁగిరిమూఁగిరెల్లెడన్

అగ్రజునితోడ శౌర్యసమగ్రుఁడైన
బేతిరెడ్డియు మృత్యువువాతఁబడుట
ముదిమిపైకొంట రాష్ట్రమునదుపు సేయు
శక్తిసడలె మహాదేవజనవిభునకు

ఒక్కదెసనణఁప వేఱొక
దిక్కున సామంతనృపులు తెంపరులగుచుం
జిక్కులు వెట్టఁగ తేనికి
వెక్కసమైయుండెనపుడు విప్లవమాఁగన్

ఈవార్తలెల్లఁ బ్రాఁకెం
దేవగిరికి, నప్పుడపుడ దిగ్గనఁ బ్రెగడన్
రావించి మంతనంబున
భూవిభుఁడదియెల్ల మూలముట్టుగఁదడవెన్

అప్పలుకాలకించి సచివాగ్రణియిట్లనె, సార్వభౌమ! నీ
చెప్పినచొప్పు శాత్రవులసేగికి విఘ్నమనంగవచ్చు, నీ
విప్పుడ యోరుగంటి పురికెత్తుటలగ్గగు, గెల్పునీదెసం
జొప్పడుఁదప్పఁబోదు రిపుసూదన సందియ మింకఁదక్కుమీ

అనవిని యప్పుడ యాదవ
జనపాలుఁడు ముఖ్యయోధసైన్యాధిపులం
దనసామంతులఁ బిలువం
బనివి కొలువు దీర్చి యిట్లు పలుకందొడఁగెన్

కాకతీయరుద్రుండు మున్ కదనభూమిఁ
దెగుటఁదత్సోదరుఁడుమహాదేవరాజు
సింహపీఠమునెక్కె, నాసీమనున్న
యతనిసామంత నృపవర్గమదుపుదప్పె

"కొంచెపడి మీకు నౌదల
వంచము, కాదంటిరేనిఁ బట్టిన కత్తుల్
దించ"మని పల్కిరఁట ద
ర్పాంచితసామంతనృపతు లయ్యొడయనికిన్

కావున విప్లవాగ్నులఁ గకావికలైన స్వరాష్ట్రమమ్మహో
దేవున కంకెకుందిగిచి తేరఁగ శక్యముగామి, వృద్ధతం
జేవదొఱంగి యుంటఁ గడుఁ జేడ్పడియుండిన కాకతీయధా
త్రీవిభునిగ్రహింపఁదగు తెన్నిపు డేర్పడె నెల్లభంగులన్

మునుపాకభంగపాటుఁదలమోచితిమన్న పరాభవాబ్ధిలో
మునిఁగినయస్మదాదులకుఁ బుట్టియునేఁడులభించెఁగాన, మీ
రనికి సమగ్రసాధనబలాన్వితులై వెడలుండు; నేఁటితో
మునుఁగునుగాతమాంధ్రుల సమున్నతి యాదవ శౌర్యవారిధిన్

అంత జేనిపల్కులాలించి కొలువెల్ల
వాలుకేలనంటి ప్రతినపట్టి
కదలిపోయెఁ గదనకండూతి మెండైనఁ
బట్టినిలుపరాదు బ్రహ్మకైన

అర్ధరాత్రమందు యాదవబల మోరు
గల్లుపురముఁజుట్టి క్రమ్ముకొనియె
నుదధివేలదాఁటి యుత్తాలముగఁ బొంగి
మిన్ను మన్ను నాక్రమించు పగిది

ఏకశిలానగర శిలా
ప్రాకారము యాదవేంద్రు బలములు పొదివెం
గాకోదర రూపంబున
రాకామిహికాంశుఁబట్టు రాహువుభంగిన్

వెలిపాళెంబున యాదవేశ్వర చమూవిన్యాసభీతప్రజల్
కలఁగంబారఁగ, యోధులుగ్రులయి వాక్పారుష్యముంజూపుచుం
బలుకంజొచ్చిరి క్రొత్తబాసల ననిర్వాచ్యార్థ శబ్దంబు లా
తులువ ల్పల్పనిదుండగింటు గలదే దోర్గర్వదుర్వారులై

ఇల్లున్వాకిలి గొడ్డుగోద యనిలే కిల్లాంధ్రలో నాప్రజల్
పిల్లల్ జెల్లలు కక్కటిల్లఁజనుచో వీరుల్ లులాయంబులన్
ముల్లెల్ మూటల మేఁకపోతులను గొంపోఁజొచ్చి రయ్యాగడం
బెల్లంజెప్పఁదరంబె? లేఁడొకఁడదేమీ యన్నవాఁడక్కడన్

కొక్కొరొకో యటం చడరి కూయఁదొడంగెను కోడిపుంజు
ట్లక్కట నిద్రవోఁదగునె? యాదవనాథబలంబు గుమ్మముం
ద్రొక్కినవేళ, నాంధ్రపురదుర్గము లగ్గలకెత్త శౌర్యముం
గ్రక్కెడివేళ లెండనెడికైవడి దుర్గబహిర్గృహంబులన్

మూడుజగంబు లొక్కపరిముట్టిన తామసుఁబట్టి చించివెం
డాడ మయూఖమార్గణసహస్రముఁ దానరివోసి కిన్కతో
నేడు గుటాలజోదరదమెక్క ననూరుఁడదల్చ మింటిపై
నాడె సువర్ణకేతనపటాంచలచంచలకింకిణీరుచుల్

కోటబురుజులెక్కి కోదండపాణులై
యంపవానగురియు నాంధ్రభటుల
యాదవేంద్రుజోదు లట్టెత్తి పరికించి
కైదువుల్ గ్రహించి కడఁగిరవికి

భానూదయసమయంబున
సేనల్ దలపడఁగఁ బోరు చెచ్చెర సాగెన్
భూనాథుఁడు దుర్గంబున
నానాసన్నాహములను నడపఁదొడంగెన్

కాకతీయ సేనానులు కాటరెడ్డి
నామిరెడ్డియు బేతాళనాయకుండు
బరవసముఁజూపి శౌర్యదర్పంబులొప్ప
మునుమునం బొడసూపి రమ్మోహరమున

క్షైత్రపాల సేనానులు శాంతవర్మ
వీరపాలుఁడు జయభద్రవీరమౌళి
యితరసామంతనృపతులు నేపుసూపఁ
దాఁకె నుద్దామభంగి యాదవబలంబు

సైన్య పృష్ఠభాగంబున క్షైత్రపాలుఁ
డానతులొసంగ నలుదిక్కులందుఁ దాన
యగుచు దుర్గముఁ జుట్టి పరాక్రమించె
యోధవీరుల కుత్సాహ మురవడింప

లగ్గలకెత్తు యాదవబలంబుల మార్కొని యాంధ్రసైన్యముల్
బ్రగ్గనఁదాఁక సాగె సమరంబతిలోకభయానకంబుగా
బ్రొగ్గినకుంజరవ్రజము మోరలుద్రెస్సినవారువంబులున్
బ్రగ్గిన వీరపుంగవశిరఃప్రకరంబును గ్రమ్మె మేదినిన్

ప్రాకారాగ్రము నుండి యాంధ్రపృతనాప్రక్షిప్త నానాస్త్రముల్
లోకాశ్చర్యకరంబుగా విసరుగుండ్లున్, వహ్నిబాణంబు ల
మ్మాఁకం గూల్పఁగఁ గాల్పయాదవభటుల్ మోమెత్తివీక్షింపఁగా
లేకల్లాడిరి త్రెళ్ళి రాశుగితడిర్లీలాప్రహారంబులన్

సలసలఁగ్రాఁగు నూనియులజల్లులు చిమ్మనగ్రోవులొత్తిపైఁ
జిలుకఁగ వెట్టులెత్తి వడిసేలలయూఁపునఁ బ్రేలాఁకు బల్
గుళికల గింగిరుల్ దిరిగి తూలుమువ్రాలుమఁ గోటదాయ నె
వ్వలనెఱుఁగంగలేక వెలఁబాఱిరి యాదవనాథసైనికుల్

"వెలుపలఁగాకతీయపృథివీపతిసైన్యముతాఁకెఁ గోటపై
నిలిచిన వీరులం జెనకనేరము, ముందరనుయ్యివెన్క గొ
య్యెలపయినిర్చిగెల్చుటయొ యీల్గుటయో పగవానిపాదముల్
కొలుచుట కిచ్చగించుటయొ కోరుకొనందగు నొక్కఁడియ్యెడన్"

అనివితర్కించి క్షైత్రపాలునిబలంబు
కోటపైనాసవిడనాడి, పేఁటనున్న
యాంధ్రసైన్యములోఁ గయ్యమాడఁదొడఁగెఁ
జావుబ్రదుకులలోనున్న జీవుపగిది

పొడిచినవాఁడెవ్వండట
మడిసినవాఁడెవ్వఁడన్నమాటదలంపం
గడఁగె నెవఁడు? క్రొన్నెత్తురు
మడువునఁదానంబొనర్చి మహియుప్పొంగెన్

వలఁబడిన సింగముంబోలుబలముఁగాంచి
శిరముఁ బంకించి యాదవధరణివిభుఁడు
జంగమాచలసన్నిభసామజమును
మత్తుమందులు పెట్టి యున్మత్తపఱిచి

కాంస్యకవచంబుఁ గుంభయుగ్మమునఁగట్టి
క్రుమ్మనెగఁద్రోల నదితాఁకెఁగోటమొదటి
ద్వాఃకవాటబంధంబు నుద్దామసరణి
నద్రిసానువుఁ బిడుగుల నడఁచినట్లు

తాఁకినతాఁకుతో గవనితల్పుపెరిల్లని వ్రీలికూలినన్
మూఁకలుసొచ్చి దిడ్డి గవనుల్ తెఱవంజొరఁబాఱు యాదవా
నీకిం మార్కొనన్ నిలుపనేరక యూరక ఱిచ్చపాటునం
గాకతియోధులెల్లఁ గడగండ్లకు లోఁగిరి డాఁగి రెల్లెడన్

అట్టులతర్కితోపనతమైన యుపద్రవ మెత్తికోలు నాఁ
కట్టెడినాథుఁ డొక్కరుఁడుఁగన్పడకుండుటఁ గాకతీంద్రుఁడే
పట్టెముఁగేలఁబట్టి మదవారణదారణ ఘోరసింహమై
కట్టుపకాసుగానిలిచి గండడఁగింపఁ దొడంగె వైరులన్

అంతట క్షేత్రపాలవిభుఁడాహవదోహలుఁడైన యాంధ్రభూ
కాంతునిమీఁదకుంగసరి గంధగజంబును ద్రోల, దంతియుం
గుంతనిభంబులైన బలుగొమ్ములఁ గ్రుమ్ముచు నెంతవాని నా
చెంతలఁ జేరనీ కడరి జీవవిముక్తునొనర్చెభూధవున్

గణపతిదేవుఁడయ్యెడరు గిన్గొని కల్పపినాకికల్పుఁడై
కనుఁగవ నిప్పుకల్ గురియ ఖడ్గమునం గరితొండ మొక్కట్రే
టునఁదునియంగవేసి రిపు డొంకెనపోటునఁగూల్పఁబూనుచో
వెనుకభటుండొకండడరి వ్రేల్మిడిఁగైదువుద్రుంగవేసినన్

పట్టుఁడు కొట్టుఁడు విడువక
కట్టుండని వైరిభటులు గణపతిదేవున్
ముట్టిరి పట్టిరి పెడకేల్
గట్టిరి చెఱసాలఁ బెట్టి కాపిడువెట్టన్

ఆవిషాదోగ్రఘటన కన్నారఁగాంచి
బావురన్నది యోరుగల్ పట్టణంబు
వలయములు వాటినది ప్రతిధ్వనులతోడ
నమ్మహార్తనాదంబు సౌధాంతరముల

దైవముతప్పఁజూడ భుజదర్పముఁ గోల్పడి యన్యజాతికిం
గైవసమయ్యెఁదెన్గుసిరి, కాకతిరాజ్యరమావిభూతితో
భూవివరంబులంగలుగు బొక్కసముల్గైకలించి యమ్మహా
దేవకుమారునిం గణపతిం గొనిపోయిరి యాదవేశ్వరుల్

తనకుదురట్లుక్రుంగ ననుతాపమునంబడి యంశుమాలి యా
నన మెఱకందగడ్డయయినం బడిమందికి మోముఁజూపరా
దని యపరాంబుధీశ్వరగృహంబునఁ దాఁదలదాఁచుకొంటకో
యనఁజనెఁబశ్చిమాచల తటాంచల భుగ్నసహస్రపాదుఁడై

# సప్తమ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

కడకంటిగవరరేకల దాఁగిలులకించు
మగసిరి యొక్కింతమొగముఁజూపఁ
గొనగోటదువ్విన నునుమీసకట్టులో
రాచపోఁడుములు దోబూచులాడ
వెడఁద ఱొమ్మునఁ దంటివిన్నఁ బాలెడఁ ద్రోసి
దొరతనమ్మల్లనఁ దొంగిచూడ
జగజంపుఁగైదోయి సైదోడుగాఁ దోఁచు
నెఱజోదు బింకంబు నిక్కిచూడ

నోరుగల్పేటి మొగసాల దారివెంట
సాగె నొకనాఁటి మునిమాపుజామునందుఁ
బెఱల మోములు వింతగా నరయువాఁడు
చూపఱకు నచ్చెరువుఁగొల్పు సొగసుకాఁడు

కొందఱెవండొకో యితఁడు క్రొత్తగవీటికినేగుదెంచె, నీ
చందము చూడఁజూడ నపసర్పుఁడెవండొ పురంబు సొచ్చెనన్
సందియమంది యప్పురుషుజాడలెఱుంగఁదలంచి ప్రశ్నలం
గొందలపెట్ట, నొక్కపలుకున్ వెడలింపఁడదేమిచిత్రమో

ఏదేశమో మీది యెఱుఁగఁ జెప్పుమటన్న
నవనలవదినుఁడై యవనిఁ జూచు

నీవీటిలో నీకు నెవరు ఒందుగులన్నఁ
గలవారి నెల్లరఁగలయఁజూచుఁ

దలిదంద్రుడులెచ్చోటఁగలరొ చెప్పుమటన్న
మీనమేషము లెంచ మిన్నుఁజూచుఁ

బట్టణంబున నీకుఁ బనియేమికలదన్న
రాజమందిర శిఖరంబుఁజూచు

నొక్కప్రశ్నకు నుత్తరం బొసఁగఁడేమి
మూఁగయో చెవిటియొ కాకమ్రుచ్చొయేమొ
మోసగాఁడీతఁడని కుట్టిమూఁక చేరి
యుగడు సేయుచొ మధ్యవయస్కుఁడొకఁడు

దాయఁబోయి యువతిఁ బాయుంగదిమి, వాని
చెంతఁజేరి మొగము చిన్నెలరసి
కనులు నలుముకొని యొగాదిగఁ బరికించి
ముక్కుమీఁద వ్రేలుమోపి కొనుచుఁ

గాకతీయవిభులు-గణపతిదేవుల
గుర్తుపట్టలైరి కుట్టిలార!
యెఱుకలేమిఁగాదె యింతచేసితిరని
పలికి, మ్రొక్కెఁ బ్రభువు పాదములకు

చేసిన తప్పుచేఁగలఁగు చిత్తములున్, నవకంపువన్నియల్
పాసిన మోములుం, బ్రకటబాష్పకణావృత దృక్ప్రసారముల్
మూసిన కేల్గవల్ గలుగు ముగ్ధమనోహరు లర్భకుల్ ముధా
యాసితరాజపాదముల నౌదలలుంచిరి యల్లిబిల్లిగాన్

వారలలేవనెత్తి నరపాలుఁడు కౌఁగిటఁజేర్చి తేర్చుచున్
మీరొనరించుశోధనము మెచ్చితి; నన్యులు వచ్చినన్ సమా
చారము నూఁచముట్టుగ విచారణసేయుటరాజనీతి, మీ
నేరిమి తెల్లమయ్యె నిదినేరమిగాఁదలపోయఁజెల్లునే?

మనమిఁకవీటికిం జనుటమంచిది రండనిపల్కు, నయ్యువల్
మనసుకలంకతేఱ నతిమాత్రముదంబున నొక్కపెట్టునన్
గణపతి చక్రవర్తికిని కాకతిరాజ్యరమానువర్తికిన్
తెనుఁగుల శౌర్యదీప్తికిని దిగ్విజయంబని ఘోషవెట్టినన్

ఆజయశబ్దవీచికలయందుదయించిన మంద్రనాద ము
త్తేజితమై, ఘనస్తనితదేశికమై ధ్వజఘంటికాస్వనా
వ్యాజసహోదరంబయి మహాజయశంఖరవాతిదేశమై
తైజసకీలమైవిరిసెఁ దత్క్షణమేక శిలాపురంబునన్

అంచెలమీఁదఁబ్రాఁకె నగరాంచలసీమలఁదాఁక నీటిపై
వంచిన నూనెబొట్టువలె 'వచ్చెమహీపతి' యన్నవార్త జి
హ్వాంచలసంభ్రమోచ్చరితమై మలయానిలసాంద్రవీచికా
సంచితమై వియత్పథవిసర్పితమై జయశబ్దమంద్రమై

కలకలమాలకించి కుతుకంబెసరేఁగిన వృద్ధులాదిగా
వెలఁదులు పిన్నపెద్దయని బేదములేక పురస్థులెల్లరున్
బిలబిల నోరుగిల్ నగరవీథులవెంబడి నేలయీనెనా
వెలలిరి, వింతలన్నఁగడువేడుకయేకద యెల్లవారికిన్

కమ్మనివార్తలాపగిదిఁ గర్ణపథంబులఁజేర నంతలో
బమ్మెరవోయినట్టి పడవాళ్ళు నమాత్యులు దండనాయకుల్
నమ్మియునమ్మలేక చని నాకధునీప్రమిత ప్రజాప్రవా
హమ్మున కగ్రయాయిఁగని రాత్మనృపాలు భగీరథోపమున్

వచ్చినవాఁడు కాకతినృపాలకవంశ కరీరుఁడేక్రియన్
వచ్చెనొ! యాదవేశ్వరుని బందిగమెవ్విధిఁబాసెనో యటం
చచ్చెరువున్ వితర్కము ప్రహర్షము శంక లపక్రమంబులై
చొచ్చి తలఁగుచున్ముసరెఁ జూపఱ చిత్తముఖాగ్రసీమలన్

యాదవేశ్వరుఁడు దయాశాలికావున
విడిపించె లెమ్మని నుడువువారు
పగవాఁడు విడుచునే మగఁటిమి వెచ్చించి
తానెవెల్వడెనని తలఁచువారు
అగునొకాదో యీతఁడతని చందం బొప్ప
వంచకుండని సంశయించువారు
కవళికల్ గమనింప గణపతిదేవుఁడే
యంచభిజ్ఞలను వర్ణించువారు

తలకు నొక్కొక్క రీతిగాఁ దలఁచువారుఁ
బలుకు వారలునై యటఁబౌరజనులు
గుసగుసల్పోయి రందందు గుములుగూడి
యేకశిల నాఁటి సందడింతింతగాదు

కన్నారనెమ్మోము గనుఁగొందమన్నచో
నశ్రువాఃపూరము లావరించు
నోరార నొకమాట నుడువుదమన్నచో
గాద్గద్యమెసరేఁగి గళముఁబట్టు
మనసారఁగొలిచి సన్మానింతమన్నచోఁ
బారవశ్యంబు విభ్రాంతిఁగొల్పు
బిగియారఁగౌఁగిఁట సొగియింతమన్నచో
నంగకంబుల జాడ్యమావహించుఁ

ప్రకృతివర్గము కర్తవ్యభావమూఢ
మానసంబయి యొకలిప్తమాత్రలోనఁ
దేఱుకొన్నది, గణపతిదేవుఁడట్లె
యొకయనిర్వచనీయార్తినుద్దుకుడిచె

ఎట్టకేని మల్లనసుతుఁ డిందులూరి
సోమనామాత్యుఁ డతిలోకశూరమౌళి
పలికెఁగైమోడ్పుమున్నుగాఁ బ్రకృతివర్గ
పక్షమునఁ బరిమితమ్ముదు ఫక్కినిట్లు

కడచెఁబదేండ్లు నీమొగిము(గాంచి నరేశ్వర! యిన్నినాళ్ళుమా
పడిన యవస్థలెల్ల భగవంతుఁడెఱుంగుఁ, దెనుంగుగడ్డపై
నడరిన చీఁకటుల్ విరిసె, నంబరవీధిఁ దొఱంగె మేఘముల్
పొడిచెదివాకరుండు మముబోఁటులనోములు పండెనేఁటికిన్

తగవుగాదు పెద్దతడవుంట యిచ్చోట
నగరుసొచ్చి వేగస్నానపాన
భోజనాదికములఁ బొనరించి పిమ్మట
ముచ్చటించు టొప్పు భూతలేంద్ర!

అని తక్కినవారిం గుఱు
కొని గణపతిదేవుఁ గూర్చికొని నగరికినే
గెను సోమన పెన్నిధిఁ గాం
చిన పేదపగిదిఁ బ్రహృష్టచిత్తుండగుచున్

స్నానమాచరించి సంధ్యావిధులఁదీర్చి
భోజనంబొనర్చి భూవిభుండు
కొలువు కూటమందుఁ గూడియున్న యమాత్యు
లాది పరిజనంబు లామతింపఁ

గూరుచుండి వారిఁ బేరుపేరునఁ బిల్చి
కుశలవార్తలడుగఁ, గోవిదుండు
సోమమంత్రివరికె సేమంబు మాకెల్లఁ
గన్నులార మిమ్ముఁగాంచుకతన

చెప్పకీరు మేము చెవియొగ్గివినలేము
పగఱవీటినాఁటి ప్రభుచరిత్ర
చెప్పకుండనేర మిప్పటిదనుక మా
పడిన భంగపాట్లు పార్థివేంద్ర!

ప్రభుపరోక్షమందుఁ బట్టఁబగ్గములేని
యాదవేంద్రు బంట్ల యాగడములు
సాగనీక తెన్గుసరదార్లు పౌరులు
తఱిమినారు దిమ్మఁదిరుగఁగొట్టి

తెనుఁగుల భాగ్యలక్ష్మి యలతెక్కలికానికిఁ జిక్కినంతనే
పెనఁకువలుప్పతిల్లఁ బలుపేలికలైన తెనుంగు గడ్డలో
మనకరిగాఁపులైమసలు మండలపాలకు లున్నదానితోఁ
దనియక గ్రుద్దులాడిరి మిధస్సమరంబులఁ గుమ్ముదుమ్ముగన్

పెద్దచేఁపలెల్లఁ బిల్లచేఁపల్ మ్రింగెఁ
గాకిమూఁకలడఁచెఁ గోకిలములఁ
బిట్టజంటపోరు పిల్లిదీర్చిన భంగి
నన్యజాతినృపుల కదనుచిక్కె

పాండ్యులొక్కవైపు పల్లవులొకవంక
హొయసలు లొకక్రేవ నుత్కలాదు
లొక్కదిక్కుగదిమి యొత్తిరిపొలిమేర
లాంధ్రజాతి నేఁటికనదయయ్యె

సేనానీప్రముఖుండు వీరయువతాశిక్షాగురుండస్త్రపా
రీణుం దూర్జితసింహసంహననుఁడీరేచర్లరుద్రుం డరి
క్ష్మానాథుల్ మన యోరుగంటి దెసకుం గన్నెత్తి వీక్షించినన్
మానప్రాణములన్ హరించినిలిపెన్ మర్యాద యీనాఁటికిన్

అనుచుఁ బలుకువేళ నవనతవదనుఁడై
విన్నరుద్రుఁ డవనివిభునిఁజూచి
వినయసుజనతావివేకసంయుతముగాఁ
బలుకఁదొడఁగెఁ జతుర భాషణముల

నరనాథా!వితథంబు తావక చమూనాథప్రతాపంబు వ్యా
కరణబ్రహ్మ యమాత్యమౌళి దిషణాఖడ్గాంచలార్చిః ప్రభల్
తెరువుంజూపకయున్న, నేకశిలపై దీప్రాంధ్రపోత్రిధ్వజ
స్ఫురణ న్నిల్వఁదరంబె యన్యులకు, నీ సోమన్నకుందక్కఁగన్

ఎన్నఁగనేలనామగఁటి మింతకుఁజేసినదావగింజయుం
తున్నది, చేయఁజాలనిదియూహకుఁదెచ్చిన శీతశైలమం
తున్నది;ముక్కనందుఁదుదియూపిరియాడెడిదాఁకనాంధ్ర రా
జ్యోన్నతికైశ్రమించి తనువూడ్చినఁ బుట్టువు సార్థకంబగున్

చాళుక్యుల్ వెలనాటి చోడవిభులున్ సామ్రాజ్యముం గోలుపో
నేలం జొచ్చిరి నేల క్షుద్రవసుధాధీశుల్ బలోపేతులై
కాలప్రాభవ మట్టిదింతకు; మహోగ్రంబైన పంచాస్యమే
జాలం బందుఁదగుల్కొనన్ వనము లోజం జంబుకాలేలవే

కొలను పురము నేలు బలియుండు కేశవ
నాయకుండు లెక్క సేయఁడెవనిఁ
దూర్పుతీరమందుఁ దోయధిపర్యంత
భూమి వానికిపుడు భుక్తమయ్యె

మధ్యభాగమందు మడపల్లెనతవాటి
బుద్ధరాజు నేఁటిభూవిభుండు
దిక్పతులకుఁగూడఁదేఁటిచూడఁగరాని
ప్రాభవంబువాఁడు పార్థివేంద్ర!

పిన్నచోడుఁడనెడి వెలనాటిసామంతుఁ
డేలికయ్యె నేఁడు కృష్ణవేణి
తీరభూమి వానితెంకి క్రొయ్యూరను
పేర వెలయుచుండు ధారుణీశ!

తిక్కచోడుఁడనెడి యెక్కటివెఱజోదు
పాకనాటి విషయపార్థివుండు
పేఁచమడఁచి నాఁటివెలనాటిపృథ్వీశు
సింహవిక్రమపురసీమనేలె

తిక్కనవెన్కఁ దత్సుతుఁడు తేజముఁగోల్పడె మన్మసిద్ధి గ
ద్దెక్కినదాది శాత్రవులకెల్లిదమయ్యెఁ; జమూవిభుండఁటే
రక్కెసగంగసాహిణి పరాక్రమశాలి స్వతంత్రరాజ్యమున్
నెక్కొనఁజేసి పుష్పగిరినిల్చె నజయ్యుఁడనంగ నేఁటికిన్

దిక్కుదివాణముంగనక తెన్గుధరిత్రిచరిత్ర మీగతిన్
ముక్కలు చెక్కలై వివిధభూపతి మన్యులచే విదీర్ణమై
ముక్కును మోముఁగోలుపడి మ్రుక్కడియైనది, యింకనైన నీ
స్రుక్కడఁగింపఁగా వెరవుజూడ వలంతివి నీవ భూవరా!

అనవిని యెల్లవారలది యౌననుచుందలలూఁచుచుండఁగా
గణపతిదేవుఁడిట్లనియెఁ గాదనవచ్చునె నీదుపల్కులున్
మనముననాటెమాకు మృదుమార్గణతుల్యములౌటఁ, గార్యకా
రణములఁబూసగ్రుచ్చిన తెఱంగునఁదెల్పితి రుద్రసాహిణీ!

ఎల్లి సభాముఖంబునన యెల్లర మానఖచూడశుద్ధి శో
భిల్ల సమస్యలన్నిఁటి వివేచన పూర్వక చర్చసల్పినం
దొల్లిటి పీడలందలఁగు త్రోవకనంబడు నెల్లభంగులన్
ముల్లెడలించుసూది మనముందఱఁదోఁచు శివప్రసాదమై

అంతటఁ బల్కెసోమన మహాప్రభువెంతయు డస్సియుండ నీ
చింతలకిప్పుడేమిపని సేదయొకించుక తీర్చికొందు చ
ర్చింతము కొల్వుదీర్చి దయచేయుఁడనన్ వినిటేఁడులేచి శు
ద్ధాంతపుఁ ద్రోవఁబట్టెఁ బ్రతిహారి యొకండటు త్రోవసూపఁగన్

# అష్టమ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

సంబరమాయె నెల్లపరిచారిక లంతిపురంబుఁ జొచ్చి సౌ
ధంబునలంకరింప, దవతప్తవనాంతరసీమఁ బోలు సో
మాంబికమానసంబు చటులాంబుదదృశ్యసురేంద్రచాప చి
త్రాంబకకేకిబర్హరుచిరాకృతియైనది భావరోచులన్

శోకమొ మోహమో సుఖమొ సుందరమైన వినూత్న శాంబరీ
లోకమొ స్వప్నమో యెడఁదలోనెలకొన్నది రాణికేదియో
వాకొనరాని సంభ్రమము; వార్థితరంగము లొండొకంటితోఁ
దాఁకియడంగు నట్లవిరతంబుఁ బెనంగె విచిత్రభావముల్

అంత గాలివాన యడఁగిన చందాన
భావవిప్లవంబుబలిమిసడల
వింటఁదొడిగెఁదుంట విలుతుండు క్రొవ్వాడి
తూపు లువిదయెడఁద త్రుప్పుడులప

పగతురచేఁ జిక్కిపతియెట్లు లాయెనో
యనుననూహ్యంబైన యార్తిఁబాసి
తనభాగ్యదేవత కనికరించునొలేదా
యను నిత్యసంశయమును దొలంగి

వాడిపోయిన తన ప్రణయవల్లరియింకఁ
జిగిరించునా యనుచింతవీడి
కదలాడునా? యాంధ్రగగనవీధి వరాహ
వైజయంతికయను వంతఁదక్కి

పదివసంతాల కాలగర్భంబునందుఁ
గ్రుంకకుండిన ప్రణయదీపాంకురంబు
స్నేహపూరంబునింపి రక్షించుకొనఁగ
దీక్షఁబూనిన దమ్మహాదేవియపుడు

ఆభిజాత్యసిద్ధమైన గాంభీర్యంబు
నంతిపురపుఁజెలుల యనునయంబు
తోడుపడఁగఁగడఁగెఁ దొయ్యలి శృంగార
వేషధారణాదివిధులు నెరప

గంధసార హిమాంబు కలితతోయంబున
నభ్యంజనస్నాన మాచరించి
యంచులఁ బసిఁడిరాయంచపంక్తులనొప్పు
హొంబట్టు జిలుఁగుపుట్టంబుఁగట్టి
హారుమంజిముత్యాల విరికుట్టు కంచెల
నున్నతోరస్థలి నూలు కొల్పి
చిక్కని యమవసచీఁకటి దిగమ్రింగు
నెఱిసోగకురుల వేణిగనమర్చి

కనకరత్నహారకాంచీకలాపముల్
కుండలాంగదాది మండనముల
సుదతిరాణి దాల్చె సోమాంబికాదేవి,
యంత దుర్గయనెడి యనుఁగు జెలియ

పాదయుగళమందుఁ బారాణి హత్తించి
కన్నుదమ్మిదోయిఁగాటు కలఁది
కన్నుబొమలమీఁదఁ గస్తూరిరేఖల
నడుమఁదిలకముంచి నగుచుఁబలికె

అక్క! నిన్నుఁ జూడ నదియేమొ! నామదిఁ
గ్రొత్తక్రొత్త వింతగుబులు రేఁగెఁ
బాపమనక నిన్నుఁ బ్రభువేమిసేయునో
తలఁచుకొన్నకొలఁదిఁదాపమడరు

అనుచు మోముఁబట్టి యలికభాగమ్మున
ముద్దుగొనఁగ దుర్గమూతిమీఁద
ముద్రపడియె రాణిభ్రూవల్లరులమీఁది
మృగమదాంకనములు మీసలట్లు

అంత రాణి దానినదలించి విదలించి
మొగముఁగాంచి నగవుమోసులెత్తఁ
బుంస్త్వమబ్బెఁగాదె పూఁబోఁడి! మీసలు
మొలకలెత్తెఁజూడు మూతిమీఁద

మాయలాఁడి! యింక మగఁడేటికే నీకుఁ
గులుకులాఁడి నొకతెఁగోరితెచ్చి
తాళిమెడనుగట్టి యాలిఁగానేలుకోఁ
గోర్కు లెల్లఁదీరుఁ గొజ్జకాన!

అనఁగ, దుర్గ మించుటద్దంబులోఁదన
మూతిమీఁదఁబడిన ముద్రఁగాంచి
పరుగులెత్తికడిగి పయ్యెదఁదుడుచుచో
ద్వారపాలికయుట కరుగుదెంచి

అమ్మా! ప్రభువులు దేవిడి
గుమ్మముదెస కరుగుదేర గుర్తించితిఁ బా
ద్యమ్మాదిగఁగైకొని ద్వా
రమ్మునచిలువంగవలయు రారమ్మనుడున్

పసిఁడిగిండిలోడఁ బాద్యంబు వలిపంబుఁ
గొనుచు దుర్గ రాణినను గమింప
ద్వారదేశమునకుఁ జేరి సోమాంబిక
ప్రభునిఁగాంచి తొట్రుపాటువొడమ

అదుపుఁదప్పెరాణి యుపఘనసంఘాత
ముప్పతిల్లెఁగనుల నుదకవృష్టి
కంపమడరె, మేనఘర్మోదకము గ్రమ్మె
నొరఁగె నాధుపాదయుగళిమీఁద

పన్నీరో? సోమాంబిక
కన్నీరో? శుద్ధిపఱిచె గణపతి మహీభృత్
పన్నీరేజ ద్వంద్వము
నన్నరపతి యన్నునెత్తి యక్కునఁజేర్చెన్

డాపలి బాహునఁ బొదువుచు
నాపడఁతికి భుజముకొంత యాలంబనగా
లోపలి లోఁగిలిఁ జేర్చుచు
భూపాలుఁడు పరిజనంబుఁబోఁజేవీచెన్

అల్లనల్లరాణి యావేదనంబాసి
సరసభాషణముల చాయమెలఁగ
సౌధశిఖరభాగ చంద్రశాలకుఁ జేరె
పావురాలఁబోలు పడుచుజంట

చిక్కని కౌఁగిటంబిగిఁచి శీతకరుండు విధూపలంబులం
జక్కిలిగింతవెట్ట, సుమసంభృతసాంద్రపరాగగంధముల్
పుక్కిట నూఁదుగంధవహపోతములాడెడి చంద్రశాల యం
దక్కవ త్రవ్విపోసికొనె నైనదికానిది యొక్కపెట్టునన్

విప్రలంభోద్గతంబగు వేంద్రమడఁగ
మోదపీయూషజలమున మునిఁగి తేలు
కౌమరుఁబ్రాయపుమిధునమ్ము గూఢచారుఁ
డయ్యనంగుఁడుగా కన్యులరయఁగలరె?

# నవమ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

కాలసమ్రాట్టు మొగసాలగంటపగిది
వేదపారంబునకుఁబూను విప్రుభంగి
టెక్కలల్లార్చి మెడ నిట్టనిక్కఁజాఁచి
కొక్కొరోకోయనుచుఁగూసెఁ గోడిపుంజు

సవతి యేగుదెంచు సమయంబు గమనించి
పెరటిగవనుదెఱచి యరుగుచున్న
రజనికొప్పుమీఁద రంజిల్లు పూగుత్తి
పగిది విధుఁడు వ్రాలెఁ బశ్చిమాద్రి

విభునికన్నమున్ను వేగుఁబోకనెలేచి
దివసలక్ష్మి నుదుట దిద్దుకొన్న
తిలకమనఁగఁ దూర్పుదెసఁదోఁచె జిగిమించు
విభ్రమంబుఁజూపు వేగుఁజుక్క

సకలాగఃప్రబలానుషంగబహుశిక్షాపాత్రతమౌధ్వాంతముం
జికురంబుల్ గొని కర్మసాక్షి స్వకరాసింద్రుంచఁ, దద్రక్తవీ
చికలం దోఁగెడిమాడ్కి నప్పుడగుపించెం బూర్వశైలంబు సాం
ద్రకషాయచ్ఛవివైనతేయతనువిస్తార ప్రభావాహినిన్

తూరుపుకొండపైవెలుఁగుదోఁచె నిరంతరమంతరిక్షసం
చారమొనర్చునీరధికసారథు లాద్యపతంగజాతి సం
సారులు బంధుమిత్రులని స్వాగతగీతము లాలపించుచుం
బారెఁగులాయగర్భములఁబాసి పతంగము లభ్రవీధులన్

సంతమసంబులం గసిమసంగుచు సత్పథయానదీక్షతో
నంతటమిత్రమండలమహోభ్యుదయంబెసఁగంగఁ బూర్వభూ
కాంతముఖాగ్రభాగము వికాసమునొందఁగ నోరుగల్లుర
ప్రాంతమహీప్రజానయనపంకజముల్వికసించె నల్లనన్

బ్రాహ్మసుముహూర్తమునయందె పాన్పువీడి
పరమమాహేశ్వరుండు భూపాలమౌళి
కాల్యములదీర్చి, శంకరుఁగాకతమ్మ
నేకవీరనర్చించె సమిద్ధభక్తి

దౌవారికుండుదెలుపన్
వేవేగ నృపాలుఁడిల్లువెడలి బహిర్ద్వా
రావధిజని కనె సాక్షా
దావిర్భూతత్రిలోచనాకృతిగురునిన్

సంజకెంజాయలో జలకమాడెడిజటా
జూటమయూఖరింఛోళియెగయ
నెగుభుజంబులఁదాఁకి నిగనిగల్పచరించు
ముత్తైపుఁ దమ్మంట్లు మురువుఁగొలుపఁ
జిఱునవ్వువెన్నెలల్ చిందు వెమ్మోమున
శాంతిపీయూషంబు జాలువాఱ
మెడనుండి దిగఁజాఱి వెడఁదఱొమ్మునవ్రేలు
స్ఫటికాక్షమాలిక చౌకళింప

ఫాలభస్మత్రిపుండ్రముల్ ప్రాఁబలుకుల
చందమునఁగ్రాల శైవదీక్షాగురుండు
బ్రాహ్మతేజ మాకారముఁబడసెననఁగ
నెదుట సాక్షాత్కరించె విశ్వేశ్వరుండు

శైవామ్నాయమహాంబురాశి శివదీక్షాదేశికాగ్రేసరున్
శ్రీవిశ్వేశ్వరశంభుసద్గురుని రాశీభూతతేజోమయ
ప్రావారావృతగాత్రు సంసరణదావప్రావృడంభోధరున్
జీవాభాసమహేశుఁగాంచి కయిమోడ్చెన్ మేదినీభర్తయున్

పరమశివరూపగురుని దీవనలు వడసి
భక్తివినయతాత్పర్యసంభ్రమము లొలుక
గురునిఁదోడ్కొని నృపతి మందిరముఁ జొచ్చి
సముపవిష్టుఁగావించి పార్శ్వమున నుండి

కుశలప్రశ్నానంతర
దశ విశ్వేశ్వరగురుండు తచ్ఛ్రియదుగుటన్
దిశలఁబరికించి పలికెన్
విశాంపతియు మోమువాంచి విన్నఁదనమునన్

దేశికేంద్రా? మీకుఁ దెలియనిదున్నదా?
కాకతీయవంశగౌరవంబు
మంటఁగలియ, నేను మనియుంటినిమ్మాడ్కిఁ
గించపఱిచి యరులు త్రుంచకుంట

ధాత్రినొఱగు దనుకఁదండ్రియుఁ బెదతండ్రి
యరుల మునుమువట్టి నటికి వీర
నాకమునకుఁ జనిరి, శోకింపవారికై
యేనుఁబ్రదికియుంట కెరియుమనసు

పలుతెలుంగులైనపొట్లకోర్చితిఁగాని
శివవిగర్హణంబు చెవులఁ జూఁడ
వెతలకగ్గమైతి, విష్ణునిఁదిక్కొండు
దైవతంబు నచటఁదలఁపఁజనదు

హనుమకొండపురాగ్రమం దాంధ్ర జయలక్ష్మి
మురువైన వలకాలుమోపునాఁడు
త్రైలోక్యమల్లబేతన్నపాలు డాకాలి
పెండారమున రిపుల్ వ్రేలునాఁడు
శ్రీపర్వతప్రస్థసీమ నుత్తాలమౌ
వైజయంతీరుచుల్ ప్రాఁకునాఁడు
ప్రత్యర్థిభూపాలపౌరుషాగ్నిచ్ఛటల్
గౌతమీవాహినిఁగలియునాఁడు
కొమరుహురుమంజిముత్యాలగొడుగుక్రింద
గొనబురతనాలగద్దియఁ గొలువుఁగొన్న
కాకతీయరాజ్యేందిర కన్నుదోయి
గోరువెచ్చని ముత్యాలఁ గురియునేఁడు

"ఉక్కివులైన శాత్రవుల యుక్కడఁగించిన కాకతీయ భూ
భుక్కుల మన్నచెట్టుచెడఁ బుట్టెనుపిందియకుక్కమూతితో
నొక్కటి"యన్ననిందనెటులోర్వఁగవచ్చును? రాచజాతిలో
నొక్కఁడనంచు నేమెలఁగ నొప్పునె చెప్పుముదేశికాగ్రణీ!

జనని జన్మభూమి స్వర్గలోకముకంటె
మిన్నయనెడి భ్రాంతి మున్నకతనఁ
బురముఁజొచ్చినాఁడఁ బూవులమ్మినచోటఁ
గట్టెలమ్మి బ్రదుకుఁ గడపుటెట్లు

పగలబందిగమునఁ బదియేండ్లపాటుండి
పట్టాభిషేకంబుఁబడయఁదగునె
సింహవిక్రములధిష్ఠించు సింగపుగద్దెఁ
గొలువుండి యేల్బడి సలుపఁదగునె
ఛత్రచామరముల జమిలి శంఖంబుల
బొమ్మిడికంబునుఁ బూనఁదగునె
సామంతభూపాల సమితికైమోడ్పఁగా
నాజ్ఞాపనంబుల నంపఁదగునె

తగుదునని సాటివారిలో మొగమునెత్తి
దేశమున మన్నెకాఁడనఁ దిరుగఁదగునె
ముందువెనుకలు పరికింప కిందుఁజొచ్చి
దిక్కుతెలియక యున్నాఁడ దేశికేంద్ర!

అని యిప్పగిదిన్ గణపతి
మనుజాధీశ్వరుఁడు దూయమానమనస్కుం
డెనలేని కొందలము తన
కనుఁగవఁదోఁపంగఁబలికి కైమోడ్పుటయున్

అగ్నిగర్భమహీధరమవిసినట్లు
మానవేంద్రుని హృదయంబు మఱుఁగుచున్న
నెవ్వగపుఁజిచ్చువెలిఁజిమ్మ, నెమ్మనంబు
కరఁగి జాల్వాఱుపగిది నగ్గురుఁడువలికె

అదియట్టిద రాజేంద్రా!
మదిఁగల యుమ్మలిక యెల్ల మటుమాయమగున్
హృదయంబుఁదెఱచి యాప్తుల
యెదుటఁ బ్రదర్శించినప్పుడెవ్వరికేనిన్

అడఁచి పట్టుకొలఁది నగ్గలంబగువగ
మొదటి కెన్నఁడేని ముప్పుఁదెచ్చు
వెల్లివొడుచునీరు వెడలింపకున్నచోఁ
జెఱువుగట్టుఁజెఱచి చెట్టఁగూర్చు

ఒకనాఁడా? పదియేండ్లీ
తికమకప్డైఁచుటకు నెంతతేఁకువ వలయుం
బెకలింపరాని శల్యము
నకటా! యెటుడాఁచినాఁడవయ్యా యెడఁదన్

హరునికంఠసీమ హాలాహలముభంగి
మ్రింగరాక వెలువరింపరాక
వేఁచుబెట్టిదంపువెతకోర్చితిన్నాళ్ళు
దైవతాచలేంద్రధైర్యసార!

కాని, యొక్కమాట కల దాలకింపుము
పూర్వకర్మఫలముఁ బొందుజీవి
ఫలమొసంగు ప్రభువు పరమేశ్వరుఁడు సుమీ
కష్టసుఖములిట్లు కలుగుచుండు

పురుషకారమునకుఁ బూర్వసంస్కారంబు
సహకరించె నేని సత్ఫలంబు
విషమమయ్యెనేని విపరీతఫలమబ్బు
కర్మధర్మసూక్ష్మమర్మమిదియె

కాలమొక్కరీతిఁగడవదెవ్వారికి
రాజుగొలువ బంటురాజ్యమేలు
విష్ణునంతవాఁడె వేసంబులనుమార్చుఁ
దిరిపెమెత్తు దేవదేవుఁడైన

ఎంతవానికైన నేయెండకాగొడు
గెత్తవలయుఁ బార్థివేంద్ర! వినుము
విజయమపజయంబు వెలుఁగుఁజీఁకటి మాడ్కి
నిలువవెపుడు వచ్చితొలఁగుచుండు

కష్టసుఖములందుఁ గలిమిలేములయందు
జయపరాజయముల సంచలింప
కొక్కరీతినుండు యోగి స్థితప్రజ్ఞుఁ
డట్టివాఁడె సౌఖ్యమందఁగలఁడు

వెరవు ధైర్యమున్ వివేకంబుఁగాలాను
కూల్యమును జయంబుఁగూర్పుఁగాని
నోర్పునేర్పుఁజూపి యుద్యమించిన నీకు
వెన్నుదన్నినిలుచు విజయలక్ష్మి

పైతృకములైన రాజ్యసంపదలవలని
గౌరవంబెంతపాటిది కాకతీంద్ర!
స్వప్రతాపసమార్జితప్రాభవంబె
యుత్తమము తృప్తిహేతువౌనుర్విపతికి

నఖరభిన్నమత్తనాగేంద్రకుంభస్థ
మాంసఖాదియగుచు మనినఁగాక
మృతకళేబరముల మెసవుచో మృగరాజ
బిరుదనామమెట్లు హరికిఁజెల్లు?

ఇట్లుపలుకు గురునియింగితం బత్యంత
గూఢమగుటఁదెలియఁగోరి, నృపతి
పలికె వినయభక్తి బంధుర గంభీర
భావయుక్త మధురవాక్యఫణితి

దేశికేంద్ర! భవన్ముఖోదీరితంబు
శ్రుతిహితం బసాధారణసూక్తియయ్యు
సర్వసామాన్యధర్మ, మస్మద్ధితంబు
స్పష్టమగుమార్గమొక్కఁడేర్పరుపవలతు

మును విషాదాంతరంగ సంమూఢమైన
నాటకముఁ గ్రమ్మఱిచి సుఖాంతమ్మొనర్ప
నెట్టిభూమిక నేనిర్వహింపవలెనొ
సూత్రధారులై నొడువుఁడా చొప్పలెల్ల

అనవిని యగ్గురుఁడిట్లనె
జననాథా! యెఱుఁగుదీవు సకలార్థము, లై
ననుబహుకాలం బీక్రియ
జనపదముంబాసియుంట శంకలు వొడమున్

నాయెఱిఁగినతెఱఁగెల్లను
వాయొడక విశదపఱుతు, బలమార్జింపం
జేయందగు జతనంబు, లు
పాయంబున లక్ష్యసిద్ధి పరిణతిఁగాంచున్

తీర్థయాత్రలొనర్చుచుఁదెనుఁగు నాటఁ
ద్రిమ్మరుచు, నేర్మి నృపుల మైత్రింగడించు
టొప్ప, వియ్యంబునం దగు నుర్విపతుల
బాంధవంబు నార్జింపుము పార్థివేంద్ర!

కాఁపు, తెలగ, వెలమ, కమ్మ కులంబుల
వేఱుపడిన నేఁటివీరతతికిఁ
దొల్లిపాదొకండె దుర్జయాన్వయమను
భానుమత్ప్రసిద్ధవంశశాఖ

వీరు నేఁడు పూర్వవిషయజ్ఞతాలోప
కారణమున, దేశకాలభిన్న
సంప్రదాయబద్ధజాతికులాదుల
వేఱుపాటు కతన వెలితిపడిరి

కావునఁ దత్కులములలో
లావును గౌరవముగల యిలానాధులతో
వైవాహి కాది బంధముఁ
గావించినఁ ద్వద్బలంబు గణ్యతఁగాంచున్

మహిత సహ్యసుతాద్వయమధ్యభూమి
పాడిపంటలగని నతవాటిసీమ
నేలుచున్నాఁడు బుద్ధభూపాలమౌళి
ధిక్కృతారాతి వైభవదివిజవిభుఁడు

ఆతని తనయుఁడు తరుణీ
చేతోజాతుం డరాతి జీమూతమహో
వాతూలుం డగురుద్రుఁడు
నీతోఁబుట్టున్ వరించు నేని శుభంబౌ

అనుఁగుఁ జెలియలు కుందాంబ కతనితోడఁ
బరిణయంబొనరించి యపారబంధు
బలసమగ్రతఁ గాంచుమీ పార్థివేంద్ర!
యీశ్వరానుగ్రహము గల్గు నింకనీకు

కృష్ణవేణీముఖద్వార పృధివినేలు
పిన్నచోడుఁడు మాఱట వీరభద్రుఁ
డతుల భాంధవసైన్య సమగ్రబలుఁడు
నతనితో బాంధవంబు నీకతిహితంబు

ఆతనికడఁ గొమరాంౘడగు
కూఁతులు గల, రతని కొడుకు కుంజరరణవి
ఖ్యాతుఁడు జాయపనాయఁడ
రాతిద్విపసింహ మాజిరంగాగ్రమునన్

పార్థివులబహువల్లభత్వంబు శాస్త్ర
సమ్మతంబగుఁగాన సంశయము వీడి
పిన్నచోడుని కూఁతులఁబెండ్లియాడు
మది సమగ్ర శుభాస్పదమధిప! నీకు

పిన్నచోడుఁడు బుద్ధభూవిభుఁ డుదాత్త
కమ్మకులసముద్భూతులుగానఁ, బూర్వ
సాగరోపాంతభూపాలసౌహృదంబు
బాంధవంబును నీపాలిబలిమి కలిమి

వెలనాడు పాకనాడుం
బలనాడలవేఁగినాడు ప్రాభవయుతముల్
కలవింకఁ బెక్కునాడులు
కలిమి బలిమి గలుగు వారి కాణాచులుగాన్

తక్కిన కులములలో నీ
పెక్కువకీడైన ధరణివిభు లయ్యెడలం
జిక్కిన, వియ్యము నెయ్యము
నెక్కొనఁ బాటింపఁదగు ననిందితసరణిన్

అందందు బిరుదుమగలై
పొందుపొసఁగనీని దృప్తభూపాలురతో
ముందు పెనంగక, వారల
చందంబులెఱింగి తఱిని సమయింపఁదగున్

తెనుఁగునాడు నేఁడు తేజంబుఁగోల్పడె
వలువ చినిఁగి గోఁచిపాఁతలయ్యెఁ
జిన్నినాడులగుటఁ జేటు మూఁడిన దిట్టు
లిరుగుపొరుగురాజు లెత్తిగదుమ

అటుయాదవు లిటుపాండ్యు లొ
కటఁ బల్లవు లొక్కకెలనఁగాళింగులు నీ
చిటిపొటినాడుల నెల్లం
గుటుకున మ్రింగెదర మృతపుగుళికలమాడ్కిన్

ఆంధ్రులందైకమత్య మావంతలేమి
నెల్లిదంబయ్యె నితరుల కెత్తిరాఁగ
వీరు సుందోపసుందులై పెనఁగుచుండ్రు
గాని, మార్తురతోఁబోరఁగడఁగరైరి

ప్రక్కవానిఁ జెఱచు పన్నాగములతోడ
నెల్లప్రొద్దుఁబుచ్చు నీసుకాఁడు
కూరుచున్నగద్దె కూలుటెఱుంగఁ డీ
తెనుఁగుజాతి కిట్టితెగులు సోఁకె

తెనుఁగువాణి వినుచు దిగ్దేశములనెల్ల
నొక్కగాడుగునీడ కొత్తవలయు,
నీయుదాత్తలక్ష్య మీడేఱునందాఁక
మడమఁద్రిప్పఁజనదు మనుజనాద ।

భూమీశుల తలఁపులెటిఁగి
నీమది పైకుబ్బనీక నీతిపథమునన్
సామాద్యుపాయములలో
ధీమద్వర! మొదటిమూటఁదేజముఁగనుమీ

ఒదిప! పేరునకే తీర్థయాత్రగాని
శాత్రవులపాలి కదిజైత్రయాత్రగాఁగ
విరళపరివారవృతుఁడవై వెడలి చనుము
పుణ్యముంబురుషార్థముఁ బొసఁగు నీకు

అనిపలికి దేశికుండుడి
గిన, నజ్జన నాయకుండు, కీలకమెటిఁగిం
చిన గురునిఁగాంచి భక్తి
ప్రణిపాతపురస్సరముగ వాకొనఁదొడఁగెన్

గురుదేవులు నామీఁదన్
గురిసిన కరుణామృతంబుఁగొలవందగునే
యరుగందగు తెరువెటిఁగితి
శిరసావహియింతు మీరు చెప్పినపలుకుల్

మజ్జనకుండు స్వర్భువనమార్గముఁబట్టుచుఁ బెద్దదిక్కుగా
నొజ్జను జూపిపోయెఁగరుణోదధి, నెంతటి యల్పబుద్ధియున్
ముజ్జగమున్ జయించి యెగుమూఁపున మోపఁడె రాజ్యలక్ష్మి, నీ
యజ్జలఁగొల్వఁగాఁదగు మహాసుకృతాస్పద భాగ్యమబ్బినన్

ఇట్లు పలుకు భూతలేశ్వరు వారించి
యాసనంబు వీడె నగ్గురుండు
పార్థివుండు వెంటఁ బ్రాకారపర్యంత
మనిచి మగిడివచ్చె నంతిపురికి

# దశమ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

ప్రాతర్భానుకరోపగూఢశిఖరాగ్రస్వర్ణకుంభప్రభా
ధౌతప్రాంతము పూర్ణకుంభవిలసద్ద్వారస్తోరణాక్రాంత ని
ర్యాతాయాతజనప్రకీర్ణము సభాప్రాసాద మాసాదితా
తీతప్రాభవవైభవాధికసముద్దీప్తిం బ్రదర్శించెడిన్

వందిమాగధబృంద వైతాళికాదుల
స్తోత్రపాఠంబుల సొబగులేదు
బహుజనసమ్మర్ద పరిహారనిరతులౌ
వేత్రహస్తుల చేతివిసరులేదు
ధవళముక్తాతపత్రపరిగ్రహంబును
వింజామరంబుల వేడ్కలేదు
ధర్మశిక్షాముద్రితంబు దండద్వయం
బిరువంకఁగొంపోవు తెఱఁగులేదు

బహుళపరిచారకుల బరాబరులు లేవు
తమ్మపడిగమ్ము లే దడపమ్ము లేదు
రత్నఖచితకోటీరధారణములేదు
నిందుకొలువునకేతెంచు నృపతికపుడు

పులకితగాత్రమశ్రుజలపూరితనేత్ర మపూర్వహర్షసం
చలితమనస్కమున్ విజయశబ్దవచస్కము రాజదర్శనో
చ్చలిత తరంగ సంక్షుభితసాగరమై కొలువొక్కమాఱుగా
బిలబిలలేచినిల్చెఁ బృథివీధవు ముంగడ నిర్నిమేషమై

ఆసభ నొక్కమాఱుకలయంబరికించి మహీవిభుండు భ
ద్రాసనముజ్జగించి కనకాసనముంగయిసేసి హస్తము
ద్రాసముపేత భావకలితంబగు దృష్టినను గ్రహింప, స్వీ
యాసనసన్నివిష్టులయి రందఱు రాజముఖైకదృష్టులై

చక్రవర్తిలాంఛనవిసర్జననిదాన
మెఱుఁగలేని సదస్యుల నేకగతుల
నాకునకుఁ బోఁక కొక్కింత యందకుండ
నూహసేయఁదొడంగి రొక్కొక్కరీతి

సోమనామాత్యుఁ డింగితజ్ఞుండు, సభ్య
సకల శంకాపనోదనచతురుఁడగుటఁ
గొలువు నల్గడ నొకమాఱు కలయఁజూచి
పరిమితాక్షరముగ నిట్లు పలికినాఁడు

జయము జయము మహాదేవ చక్రవర్తు
లమరలోకము వేంచేసినంతనుండి
యధిపవిరహితమయ్యె భద్రాసనంబు
శాంతి పౌష్టికక్రతువులు సలుపవలయు

తీర్థయాత్రకై మనధర్మిత్రీరమణులు
వెడలనున్నారు నేఁడెల్లి వీటినుండి
తిరిగివిచ్చేసి యొక శుభదివసమందుఁ
బట్టబంధోత్సవంబును పడయఁగలరు

ప్రభుముఖాంబుజమునఁ బ్రభవించువాణికై
యెదురుచూచుచున్న దెల్లకొలువు
నని యమాత్యుఁడధిపునాననంబునఁజూడ్కి
నిలుపఁ; బలికెమేదినీవిభుండు

కల్యాణమస్తు! సత్కవిరాజ శాస్త్రజ్ఞ
సకలకళాపూర్ణచంద్రములకు
శుభమస్తు! ధిషణసన్నిభమంత్రి సేనాధి
పతి యోధ పరిజన బాంధవులకు
అక్షయమస్తు! మహాంధ్ర సామ్రాజ్య ల
క్ష్మీకరాముక్త నిస్త్రింశమునకు
భద్రమస్తు! మదన్వవాయమహీనాథ
విక్రమార్జిత భద్రపీఠమునకు

ననవరతమును మమ్మేలునాదిశక్తి
కాకతమ్మ, కృపారాశి యేకవీర,
జగదధీశ్వరుఁడౌబాలచంద్రచూడుఁ
డరయుచుందురు గాక! శుభైకదృష్టి

కాకతిబేతరాజుమును కాలిటమోపిననాఁటినుండి, శౌ
ర్యాకర యుష్మదన్వయమహామహులెల్లరనూనభక్తితోఁ
గాకతిరాజ్యలక్ష్మి కొకగౌరవమున్ గడియించిపెట్టి యీ
లోకముఁబాసి రేసుకృతలోకమున న్విహరించుచుండిరో

అమ్మహితాన్వయక్రమము నందుదయించిన యుష్మదంతరం
గమ్ములు దేశభక్తికి జగద్ధితదీక్షకు మూలకందముల్
కుమ్మరిసారెయై తిరుగుఁగుంభిని ఘూర్ణిలువార్ధిసప్తకం
బమ్మరివోసి మీరలు రణాగ్రమునం బెడబొబ్బఁబెట్టినన్

తాతలు తండ్రులుంజనినదారియొకించుక తప్పకేగు మీ
చేతము లక్ష్యయంబులగు శేవధులంచుఁదలంతుమెప్పుడున్
జాతికి జీవగఱ్ఱలయి సర్వమునొడ్డెడి దేశభక్తులే
భూతలదైవతాకృతులు పూజలఁగైకొనవర్హులెయ్యెడన్

పుట్టినవాఁడు సంసరణమోహమునంబడి కొన్నినాళ్ళకున్
గిట్టకతప్పదీనడుమఁ గీర్తిగడించినవాఁడమర్త్యుఁడౌ
నెట్టియఖండభూవలయమేలినటేఁ డయశస్కుఁడైనచోఁ
గట్టెఁడికాలగర్భమునఁగ్రాఁగి జగంబునఁబేరుమాసెడిన్

బ్రదికిననాల్గునాళ్ళుబుజువర్తనులై, యపమార్గలబ్ధ సం
పదలకు లోఁగ, కెట్టియెడఁబౌరుషమున్ విడనాడకే ప్రజా
భ్యుదయ నివిష్టబుద్ధిపరిపూత చరిత్రులు దేశభక్తులే
త్రిదివమునైన గెల్వఁగల ధీరులుదారులుదాత్తులిమ్మహిన్

రాజ్యము వీరభోజ్యము, తిరంబుగనిల్వదు నీతిఁదక్కి, దే
వేజ్యుఁడమాత్యుఁడయ్యు బలభేది ప్రవాసము మాన్పనేర్చెనే?
పూజ్యుల ధిక్కరించి కులముందెగటార్చిన రాజరాజుకున్
భోజ్యములయ్యెనే సిరులు? భూపతిధర్మముఁదప్పనొప్పునే?

యాదవులేదియోపగకు నగ్గముగా మనపట్టణంబునం
బాదము మోపినారు, జనపాలనకోపిరాకో? ప్రజాభిమా
నాదరదూరుఁడైనవసుధాధిపుఁడేలసమర్థుఁ డౌనె? వాల్
వాదరమీఁదిసాము నరపాలునిజీవిత మెట్లుచూచినన్

గతజలసేతుబంధనసఖంబగుఁ బూర్వకథావిధం, బనా
గతబహుకాలగర్భమునఁగల్గు భవిష్ణవెఱుంగరా, దసం
గితములు వాకొనందగదు, క్రమ్మఱనేరదతీతకాల, మే
గతివివరింపనేర్తు మిదికాదిదియౌనని ప్రాజ్ఞకోటికిన్

కాలము నిర్ణయింపఁదగుఁగాఁగల కార్య, మమాత్యమౌళి మీ
మ్రోల వచించినట్టి దిఁకముందటిమాట, యదెట్టిపద్ధతిం
దేలునొ వేచిచూడఁదగుఁ, దీర్ఘమొ స్వార్థమొ యెట్లు వాకొనం
జాలుదు? మమ్మహేశ్వరుని శాసనమేరికిఁ ద్రిప్పశక్యమే?

అని యిట్లు పలికి గణపతి
మనుజాధీశ్వరుఁడు కొలువు మానుటయుం, ద
క్కినవారు తగిన తెఱఁగునఁ
బనివినియెదమని యనుజ్ఞఁబడసి యరిగినన్

లేఁడు సోమమంత్రి రేచర్లరుద్రసే
నానియనుసరింప లోనికరిగి
కొంతతడవు గడపునంతట మధ్యాహ్న
ఘంటమొరసె ఖంగుఖంగుమనుచు

# ఏకాదశ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

పలపలవేగునంత నరపాలుఁడు, సోమనమంత్రి యల్పమౌ
బలఁగము వెంటరా నతిశుభప్రదముల్ శకునంబులెంచుచున్
వెలలిరి తైర్థికప్రకటవేషములం గయిసేసి ప్రాఙ్మహీ
తలగతపుణ్యతీర్థముల దైవములంగొలువందలంచుచున్

తెరువున నందునందుఁగల దేవళముల్ గనుఁగొంచు భక్తిత
త్పరమతి దేవదేవు బహుభంగులఁగొల్చుచుఁ బుణ్యసహ్యభూ
ధరసుత కృష్ణవేణిజలధారలఁగ్రుంకి తరించి దాఁపునన్
ధరణిధరంబుఁగాంచి వసుధావిభుఁ డగ్గిరిదుర్గమేమన్

సోమనామాత్యుఁడగ్గిరిఁ జుట్టవేలఁ
జూపియిట్లనె నదియొకసుగతచైత్య
మొక్కనాఁడది విశ్వముల్బ్రోఁతలూఁగఁ
గేతనంబుల నెత్తె దిగ్వీధులందు

నరనాథా! వినలేదె? బౌద్ధగురుఁడౌ నాగార్జునాచార్యుఁడీ
గిరిశృంగంబున సర్వదర్శన కళాకేంద్రాగ్రవేదిన్ జగ
ద్గురుపీఠంబుననున్ననాఁడు తనివోఁగ్రోలెంబ్రపంచంబు త
త్పరమార్థప్రతిపాదన వ్యతికరవ్యాఖ్యానపీయూషమున్

ఆపాంతన్ విజయాభిధంబగుపురం బానాఁటియిక్ష్వాకు ధా
త్రీపాలోత్తమ రాజధానియయి వర్ధిల్లెం ద్రిలింగేందిరా
శ్రీపాదద్వయి సింహళాంకమునకున్ శీర్షంబు వింధ్యాద్రి సా
నూపాంతమ్ములఁజూఁచుకొన్నది సపత్నోర్వీరమాసేవ్యయై

తెలుఁగుందల్లికి గుండెకాయయని కీర్తింగన్నదీప్రాంత, మీ
పలనాటం బ్రవహించె వీరరుధిరాంభఃపూర్ణముల్ వాహినుల్
నిలిచెన్నేఁటికి స్మారకంబులగు చిన్నెల్ మార్గమధ్యంబునం
దెలియం జాలిన బాటసారులిటఁగన్నీరోడ్తు రీనాఁటికిన్

మలిదేవాదుల రాజధాని మునుపీమాచర్ల, యిప్పీటిలో
వెలసెన్ శీలమ్రబ్రహ్మనాయునిమతావేశంబునన్ వైష్ణవ
స్థలరాజంబదె చెన్నకేశవుఁడధిష్ఠానంబుగా వర్ణముల్
కులగోత్రంబులు హెచ్చులొచ్చులనిటం గోల్పోయి యల్లాడఁగన్

నలగాముండొక కీలుబొమ్మ యగుటన్ నాగమ్మ దుస్తంత్ర మీ
పలనాఁడెల్లను కోడిపోరుమిషతో భస్మంబుఁగావింపఁగా
నిలిచెం గారెమపూఁడి రంగమున మన్నీలుష్ణరక్తాంబుధిన్
జలకంబాడిన విక్రమోర్జితకథాసారంబులాంధ్రావనిన్

ఈ గురిజాలకోట బురుజెక్కి నటించిన తెన్గుబావుటా
భోగములంతరించి పెనుబూడిదపోగులు నిల్చెనియ్యెడన్
నాగమవాఁడిచూడ్కు లెదనాటిన యీపలనాటిగడ్డలో
డాఁగినపౌరుషాగ్ని కెరటంబులడంగవు నేఁటికేనియున్

ఈ గుంటూరుపురంబు చోడధరణీభృద్రాజ్యలక్ష్మి విహా
రాగారంబయి కొమ్మమంత్రి ధిషణావ్యాపార గుప్తంబుగాఁ
బ్రాగాంధ్రంబున వాసిగాంచినది, యీ ప్రాంతంబు మీధాటికిన్
లోఁగెన్ మీ పెదతండ్రి యాలమునఁ జోళుంద్రుంచి తూఁటాడుటన్

ఆవెలనాటికయ్యమున నయ్యెతెగన్ పృథివీశ్వరాఖ్యుఁ డా
భూవిభునందనుం డడలిపోయి వసించుచుఁ బీరికాపురిన్
ఈవెలనాటివంకఁగనులెత్తి కనుంగొనఁడయ్యె రుద్రధా
త్రీవిభుఁడున్ననాళ్ళ గడిదేటెనతండవలన్ మహోద్ధతిన్

ఆతనిఁబాకనాటివసుధాధిపముఖ్యుఁడు తిక్కచోడ వి
ఖ్యాతుఁడు గీటడంచి వితతాంధ్రమహీతలభర్తయయ్యె, నీ
భూతలకాముకుల్ నృపులు పోరులఁద్రుంతురు త్రుంగుచుందు, రా
నేతలరీతులం దెలుపనేర్తురు కావ్యములంగవీశ్వరుల్

కవిచతురాననుల్ కడఁగి గంటముఁబట్టకయున్న విశ్వస్పృ
ద్భువనవిలాసమే యణఁగిపోయినశించును కాలగర్భమం;
దవిదిత పూర్వమానుషమహాచరితంబగుజాతి యున్నతి
ప్రవణముగాదు జంతుతతిభంగి నజస్రముఁబుట్టిగిట్టెడున్

అనిమొన నౌత్తరాహమనుజాధిపు దోర్బలశాలి విక్రమా
ర్కునిఁబొరిగొన్న యుగ్రరణకోవిదుఁడున్ శకకర్త శాలివా
హనన్నృపువంశమేలిన మహావిభవాస్పద పత్తనంబులం
గనుఁగొను మల్లధాన్యకటకం బమరావతి నాఁ బ్రసిద్ధముల్

ఇచ్చటి దేవదేవుఁ డమరేశ్వరుఁడాశ్రిత కల్పశాఖియై
యిచ్చుసమస్తసంపదల, నిందలిప్రాక్తనబౌద్ధచైత్యమున్
వచ్చి శివాలయంబుగ నొనర్చిరఁటన్నవదంతియున్నదా
ముచ్చటకేమి? యీ భువనమోహనదృశ్యము పావనంబగున్

సహ్య భూభృత్కులస్వామి యొౌదలమోచి
లాలించి పెంచుగారాలకూన
శ్రీశైలశిఖరాగ్ర చిన్మూర్తియై వెల్గు
శ్రీమన్మహాదేవు చెలిమికత్తె
అమరేశ్వరస్వామి యాస్థాననర్తకీ
సముదాయ నృత్తశిక్షాప్రదాత్రి
ఇంద్రకీలాచలంబెక్కి లోకంబేలు
కనకదుర్గమ్మకు ననుఁగుఁజెల్లి
కాకుళక్షేత్రమున నాంధ్రకైటభారి
యంఘ్రియుగ్మము సేవించు నమలచరిత
కర్షకాంధ్రప్రజానీక కల్పవల్లి
నిక్కమగుతల్లి కృష్ణవేణీమతల్లి

అని యాయాపగ మహిమం
గొని యాడుచుఁదజ్జలములఁగ్రుంకి యుమానా
ధునిఁబూజించి నుతించుచుఁ
జనుచో నమ్మంత్రివరికె జనపతితోడన్

నేఁటికిఁగోటకేతధరణీవిభుఁ డేలికయయ్యె నీజగా
వీటికి ధాన్యవాటికిఁ ద్రివిష్టపసుందరరాజధానికిన్
కూటికి గుడ్డకీ ధరణికోటనృపాలుని రాజ్యసీమలం
గాటకమన్నమాట మునుకన్నదివిన్నది కాదుభూవరా!

ఆనృపాలుండు నీకుమేనత్తకొడుకు
గానతన్ముఖమున మనకార్యసిద్ధి
కరతలామలకంబగు ధరణినాథ!
పోయిదర్శింత మింక నప్పుడమితేని

సచివమౌళి యిట్లు స్థలపురాణంబులు
చిత్తమలరఁజెప్పి చేరఁదెచ్చె
ధరణికోటవిభుఁడు తగిన తెలుంగున
స్వాగతంబుఁబలికి సత్కరించె

రాచవారికిఁదగిన మర్యాదలెల్ల
నడవ, ధాన్యకటకపురీనాథుఁజూచి
పలికెసోమన గణపతిపక్షమూని
రాయబారంబునడుపు మార్గంబులెంచి

రాజా! నేఁటికిఁ గ్రూరరాహుఖర దంష్ట్రాముక్త భానుక్రియన్
తేజోలేశవిభావ్య కాకతిధరాధీశుండు మీప్రోలి క
వ్యాజస్నేహము బాంధవంబు మదిసంభావించి యేతెంచి, త్వ
త్పూజాభాజనుఁ డౌట పూర్వకృతమౌ పుణ్యంబుగా నెంచెదన్

ధాన్యకటకేంద్ర! పూర్వబాంధవము, యుష్మ
దాభిజాత్యము, సౌజన్య, మార్దవంబుఁ
గట్టితెచ్చిన విటకు మాకాకతీశు
నేకలక్ష్యార్థసంసిద్ధి నెంచుకొనుఁడు

ఇట్లు పలికి సచివుఁడే కాంతమందిరా
భ్యంతరమున కాధరాధినాథుఁ
గొంచుఁబోయి మగిడి కొంతసేపటి కట
కరుగుదెంచె వికసితాస్యుఁడగుచు

సరసభాషణముల సన్మానముల తోడ
భావికార్యఘటన భావనములఁ
గాకతీయనృపతి కలలతో నానాఁడు
కరఁగిపోయె నొక్కగడియవోలె

# ద్వాదశ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

మఱునాఁడు వేగుబోకనె
కరిరాజమునెక్కి ధాన్యకటకేశ్వరుఁడుం
బరిజనముఁగూడి తూర్పున
కరిగెన్ గణపతినరేశ్వరార్థోన్ముఖుఁడై

నీరజబంధు వస్తధరణీధరశృంగముడిగ్గ నమ్మహీ
దారుఁడు దంతిడిగ్గి వసుధాసురసేవిత కృష్ణవేణికా
తీరమునన్ ముహుర్ముహురధీత బహుశ్రుతిపావనంబు కా
ల్హారునవిశ్రమించెఁదనువుల్లసిలన్ మలయానిలంబులన్

వేకువ వేదముల్గఱచువిప్రకుమారుల సంతతోడఁ బుం
స్కోకిలగానముల్ చెవులసోఁకఁగ భూపతిమేలుకాంచి, య
వ్వాఁకఁదరించి, యాంధ్రమధువైరికిఁబాయని కాణయాచి శ్రీ
కాకుళపత్తనం బెదుటఁగాంచెఁ బురాస్మృతులంకురింపఁగన్

మున్నది పాతవాహననృపుల్ తమకుం దొలిరాజధానిగాఁ
గన్నపురంబు, ధాన్యకటకంబటుపిమ్మట రాజధానియై
యెన్నికకెక్కి నేఁడు తనయేల్బడిక్రిందికి వచ్చె, నిప్పుడే
పున్నెముపండెనో కడచిపోయిన కాలముఁ గ్రమ్మఱింపఁగన్

ఆంధ్రవిష్ణుని రమ్యదివ్యాలయాగ్ర
కనకలశప్రభారాశి కన్నుఁగవకు
దివ్యదృష్టి యొసంగినతెఱఁగుతోఁప
నరిగె సుస్నాతుఁడై యాలయంబుదెసకు

పిన్నచోడమహీపతి వేగువలన
ధాన్యకటకనృపాలు వార్తలనెఱింగి
ప్రకృతి సహితుఁడై యతనికి స్వాగతంబుఁ
బలుక శ్రీకాకుళమునకుఁ బయనమయ్యె

ధరణికోట విభుండు తత్పురతనాంధ్ర
విష్ణుసేవించి యవ్వీడువీడుకొలుపఁ
గొంతదవ్వేగి క్రొయ్యూరు చెంతనున్న
తెన్నునంగాంచె నరుదెంచుపిన్నచోడు

దరహసితవదనుండయి ధరణికోట
ఱేఁడు దోతెంచునప్పిన్నచోడుఁగాంచి
యాడఁబోఁ దీర్థమే యెదురయ్యెఁగాదె
యింతకన్న శుభోదర్క మెందుఁగలదు?

అనఁగ విని పిన్నచోడుఁడు
వినయముదోఁపంగఁబలికెఁ, బెన్నిధితానై
చనుదెంచుఁ బేదయింటికిఁ
గనికరమున నీదుకాలు గడపంద్రొక్కన్

ఊరక వత్తురె? బలవ
త్కారణమొకఁడుండనోపు; దయచేయుఁడు క్రొ
య్యారేమిచే సెఁబున్నెమ
యారే! యనిపిన్నచోడుఁ డాదరమొప్పన్

అతనిఁగొంచుఁబోయి యాతిథ్యముంగూర్చి
కుశలవార్తలెల్లఁగుచ్చియడిగి
యాజ్ఞయేమియన్న, నంతటిమాటేల?
కూర్మిసోదరులకు మర్మమేల

తూరుపు తెన్గునాడు పలుత్రోవలఁద్రొక్కుటఁజేసి యందులో
వైరములుప్పతిల్లి పెఱవారికినెల్లిదమయ్యె, నీక్రియన్
గౌరవమంతరింప దినగండముగాఁ గడపంగవచ్చునే
దారము లేక క్రొవ్వెదకుఁదార్చిన పూవులు నిల్వనేర్చునే?

ఎక్కడి తెన్గు రాష్ట్రమిది? యెక్కడి పల్లవు, లేటి యుత్కళుల్
ముక్కడి మూఁకలెల్ల నెఱపోటరులై కడలొత్తుటేమి? నేఁ
డుక్కెడలెందెనుంగులకు నోర్చును నేర్పుఁదొఱంగియుంట, నీ
చిక్కులఁదీర్చి జాతినొక చేవకుఁదెచ్చుటమేలు కాదొకో

కులమునెంచునొకఁడు గోత్రమ్ము నొకఁడెంచుఁ
దెగల నొక్కఁ డొకఁడు దెసలనెంచుఁ
దెనుఁగు జాతియొక్కఁడని యెంచకీజాతి
జయముఁగనునె కోటి జన్మములకు

తెనుఁగు రాష్ట్రమిపుడు తెగిన హారంబయ్యె
నొక్కసూత్రమందెయొదిఁగియుండఁ
గాలికి పూసతోడఁగూర్పనేరనివాఁడు
గణుతిలేదు మణులు గంపెఁడైన

మనకు నేఁటికున్న మందిమార్బలమెంత?
పగఱ నోర్వఁగలమె భండనమున
చేయికాల నాకుఁజేపట్టఫలమేమి?
ముందు చూపువలదె పుడమి పతికి

లోఁతుపాఁతులెఱుఁగు లోకజ్ఞుఁడవు నీవు
చతురుపాయనీతి చతురమతివి
నిశ్చయింపుమొక్క నిరపాయమార్గంబు
తిరుగులేక నేఁటితరము గడవ

అనవిని పిన్నచోడవసుధాధిపుఁడిట్లనెఁ గేతరాజ! నీ
వనినదినిక్క, మిట్టిమనయాశయసిద్ధికిఁ దోడువత్తురే?
మనుజపతుల్ నిరంతరము మచ్చరమూని పెనంగఁజూతురీ
తెనుఁగుధరిత్రి, నెట్లు కడతేఱునొక్కమ్మిన కాఱుచీఁకటుల్

అలనతవాటిబుద్ధవసుధాధిపుఁడాప్తుఁడు నీకునాకు దో
ర్బల ధిషణాబలాన్వితుఁడు బంధుసమగ్రుఁడుగాన నవ్విభుం
గలిసి పరిస్థితుల్ దెలిపి కాఁగల కార్యము నిశ్చయించినన్
ఫలమొనగూడునేమొ జనపాలక! యోచనచేసి చూడుమీ!

అనఁగ విని కేతరాజనె
జననాయక! నీదుపలుకుసంభావ్యం బౌ
మనమతనిఁగూడఁగార్యం
బనుమానములేక సఫల మగునని యెంతున్

ఎల్లిమనమరిగి యాతని
యుల్లంబరయుదముగాక! యుద్యోగికి నీ
ముల్లోకంబులు లోఁగుం
గిల్లాకుంబంపుమిపుడ కింకరుచేతన్

అతనిమాటవెంట నశ్వంబుతోపాటు
ముద్రవైచినట్టి ముడియునిచ్చి
సాగనం పెనొక్క జంఘాకరికు నత
వాడికపుడ పిన్నచోడవిభుఁడు

మూడవనాఁడిరువురు నత
వాడిన్ మడపల్లె బుద్ధవసుధాధీశుం
గూడికొని వివరముగ మా
టాడఁగ నవ్విభుఁడు సకలమామోదించెన్

అంతటఁగేతరాజు తనయాశయమున్ వివరించెనిట్లు భూ
కాంతుల రాజనీతి యధికారము వెంబడి మాఱుచుండు; న
వ్వింతతెలుంగనేర రలవేలుపుటొజ్జయుఁగావ్యుఁడైన; మే
ల్బంతులు గారె యాంధ్రనరపాలకులెల్లరుఁ గూటనీతికిన్

అవసరమునుబట్టి యవనీంద్రులకుఁజెల్మి
వైరమును ఘటిల్లు, వారితలఁపు
లాలికైనఁదెలియనలవిగావెన్నఁడు
రాచవాని నమ్మరాదుసుమ్ము!

మనలోని మాటయిది, నీ
వని నేవని భేదభావ మావంతయు నా
మనమునలేదుసుమా! యిది
జనపాలుర చిత్తవృత్తిచందంబంటిన్

కావున బాంధవమ్ము చిరకాలమునిల్చెడి బంధమౌట చే
భూవరులిచ్చిపుచ్చుకొను పొందికగల్గినఁగూడియుంద్రు, మున్
మూవురమట్టిచుట్టఱికముం బొసఁగించుట మేలటంచు నా
భావమునుగ్గడింతు, నిద్రిప్రాజ్ఞులు మీరు విమర్శసల్పుఁడీ!

ఆ పలుకులు విని బుద్ధమ
హీపాలుఁడు సంతసిల్లి యిట్లనె, రాజా!
నీపలికిన చందంబది
భూపాలకజాతికబ్బుఁబుట్టుకతోడన్

బాంధవంబుకతనఁ బార్థివులొకబాట
నిలిచియుంట కొంతనిక్కువంబు
మనకు ముగ్వురికిని మునువియ్యమందుటే
రీతిఁగుదురుననఁగఁ, గేతరాజు

పలికెనిట్లు, మనకుఁబ్రత్యక్షముగ వియ్య
మంద వావివరుస లనుమతింప
వన్నదమ్ములనెడి యానవాయితియుంటఁ
గొంత యెడముగల్గఁ గూర్పవచ్చు

మనము రాజనీతి మనమున నిడుకొని
వ్యూహమును రచింపఁబూనియుంటి
మందుకతన బలవదభిజాతు నాలవ
వానితోడఁగలుపవలయు వరుస

మాకుంగాకతి రాజవంశమునకుంబంధుత్వసంబంధముల్
చేకూరెన్మును, యాదవ ప్రభువు లాజింగెల్చియయ్యోరుగ
ల్లేకాలంబున నేలరైరి, తుదకందేకాతపత్రంబుగాఁ
గాకత్యగ్రణి రాజ్యమేలు నిపుడా కల్యాణి పర్యంతమున్

గణపతిదేవుఁబోలు మొనగాఁడొకఁడైనను తెన్గుగడ్డపైఁ
గనపడఁడయ్యె, వైరిబలఁగమ్ము బలంబులు నాల్గుదిక్కులన్
మొనసిననాఁడు మార్కొనెడి భూరిపరాక్రమశాలి యొక్కఁడే
మనమునఁదోఁచునేనియనుమానముమానివచింపుఁడియ్యెడన్

ఇట్లు పలుకునప్పు డిరువురి మొగముల
చిన్నెలరసి వారి చిత్తమెఱిఁగి
తిరిగి పలుకఁదొడఁగె ధరణికోట విభుండు
పట్టినట్టి కాయ పండనుంట

ఆతని తోడివియ్యము శుభాస్పద, మీపిన చోడుఁడీఁదగుం
గూఁతులవాని, కన్విభుసె కూరిమి చెల్లెలిఁగుందమాంబ సం
ప్రీతిగ్రహింపు కోడలుగి, మీకును వారికిఁబెంపుఁగూర్చు నీ
చేఁత యటంచుఁబోఁవిసిది చెప్పితి, మీమది నెంచి చూడుఁడీ

అనఁగి, పితరులిరువు రన్యోన్యముఖ కళా
భంగులరసి లోని యింగితములఁ
జదువుకొనిరి సిందుసంతసంబున, నంత
బుద్ధనృపతి ముందు ముచ్చటించె

అన్న! నీవు నుడివినట్లెల్ల నడివిన
నంతకంటెఁగిలదె యభ్యుదయము?
కాని యడయొవలదె గిణపతి మతమేమొ!
యెఱుకలేసిబాటకేగఁదగునె?

అనెడి బుద్ధరాజు నానుకూల్యము నెంచి
పిన్నచోడవిభుఁడు మిన్నకుంట
నతనియంతరంగ మానసపీమనె
గాంచఁగిల్గె ధాన్యకటకనృపతి

గణపతిదేవుఁడల్లుఁడఁట, కాకతిరాజ్యరమాసపత్నులై
యనుఁగుఁగొమార్తెలెక్కిరఁటయందలముల్, సరిరాచవారిలోఁ
దనకు మహోన్నతంబయిన స్థానముదక్కెనఁటన్నయూహలన్
మునిఁగిన పిన్నచోడు ననుభూతిని వర్ణన సేయనేర్తుమే?

ధవళాతపత్రము దండద్వయంబును
వింజామరంబులు వెంటనడువఁ
జనుబాటలో జనసమ్మర్దమెడలింప
వేత్రహస్తులు పిరువీఁకుసేయఁ
బరిజనసేనాధిపతి మంత్రులొక్రేవ
కొత్తగిల్లి యొకింత యొదుగుచుండ
జయశబ్దముఖరులై భయభక్తివినతులై
సామంతనృపతులు సాఁగిమ్రొక్క

గణపతింగూడి పేరోలగమున కరిగి
రుక్మ సింహాసనమునఁగూర్చుండినట్లు
పిన్నచోడమనోనభోవీధి మెఱసె
భావశబలిత మంజుల స్వప్నలహరి

బుద్ధ నృపతి వెడలఁబుచ్చినశంకకు
ధరణికోట విభుఁడు తగినరీతి
బదులు పలుకఁదొడఁగె బ్రహ్మాండమఱచేతఁ
జిక్కినంతతృప్తిఁ జిత్తమలర

గణపతిదేవు వేనచిరకాలమునం గనుఁగొందు; వానినె
మ్మనమునకెక్కఁజెప్పి మనమార్గములోనికిఁదెత్తునమ్మఁ,డ
మ్మనుజవిభుండు నాకడకమాత్యునితోఁ జనుదెంచు రేపు మా
పని యొకవార్తవింట భవదాశయమే నెఱుఁగంగవచ్చితిన్

తలఁచిన వ్యూహమెన్నఁటికిఁదప్పదిఁకన్వినుఁ, డోరుగంటి కీ
స్థలమతిదూరమౌటఁ, దలిదండ్రులఁ బాసియొకర్తెయుంట ము
న్నలవడకుంటఁ బిన్నవసుధాధిపు గాదిలికూఁతులిర్వురుం
గలిసివరించుటొప్పఁగద! కాకతినాధునిఁ బ్రాణనాధుగాన్

జాయపనాయఁడు గణపతి
జాయలకుందోడుగాఁగఁ జనుటయుమేలౌ
నాయెడ సంస్కృత శాస్త్రా
ధ్యాయమునకు నృత్తశిక్షకవకాశమగున్

కుందమనీకుఁగోడలయిగుమ్మముఁద్రొక్కిననాఁడుచూడుమా
కుందనమాత్మగౌరవముఁగోల్పడు, వెంతటి భాగ్యశాలినీ
నందనుఁడోరుగంటి నరనాథుల కల్లుఁడు, వియ్యమంద నీ
వందల మెక్కునాఁడు వసుధాధిపులీరసఁగుందకుందురే?

పిన్నచోడ నృపతి పున్నెంబు పండెఁబో
రొట్టెవిఱిగి నేతి చట్టిఁబడిన
దరుగు దేవిడి కితఁడడ్డమాఁకయులేక
చక్రవర్తిమామచనవుదోఁప

పిన్నచోడుఁడామాటలు విన్నతోడ
నిదురమేల్కాంచువడువున నిక్కినీల్గి
చిన్నగానవ్వివల్కెనోయన్నలార!
యింతకున్ యుష్మదాశీస్సు లీశ్వరేచ్ఛ

కొంతతడవట్లు మువ్వురు
సంతసమున సరసమధురసల్లాపములన్
వింతలగు క్రొత్తయూహల
స్వాంతంబులు తనియఁగడపి చనిరి యథేచ్ఛన్

# త్రయోదశ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

ఆపూర్వాపరవార్ధిమధ్యగతరాజ్యం బుగ్రబాహాబల
వ్యాపారంబున నిస్సపత్నసరణిం బాలించు చాళుక్యదో
శ్చాపాటోపమడంగఁగా మిగిలెఁదచ్ఛాఖావశేషంబుగా
భూపాలోత్తముఁ డిందుశేఖరుఁడనంబూర్వాంధ్రదేశంబునన్

వేంగిరాజ్యమెల్ల వెలనాటిచోడుల
కైవసంబుగాఁగఁ గాలగతికిఁ
గేలుమోడ్చి నిడుదప్రోలు సామంతుఁడై
యిందుశేఖరవిభుఁ డేలు చుండె

కొలనిపురాధినాధుఁ డరికుంజరకేసరి కేశవాఖ్యుఁడా
బలియుఁడు పంచలోని పగఁబట్టిన పామయిపోయె, వానితోఁ
దలపడఁజాలినంతటి పతాకినిఁగల్గమియిందుశేఖరుం
డెలఁబడి మార్గ్యనంగడఁగడెన్నఁడు నీతివిదుండుగాన్సనన్

ఆయొడయనితోఁగయ్యముఁ
జేయందగు బలిమి కలిమి చేవయులేమిన్
రేయుంబవలుం గన్గవ
మూయండానిడుదప్రోలి భూధవుఁడెపుడున్

పగతుబుద్ధినెపుడు పాపపుఁబురువులు
తొలుచునో యెఱుంగనలవికాదు
ముప్పుమూఁడినపుడు ముత్తాతదిగిరాఁడు
చెలిమి కలిమిలేని చెనఁటిదెసకు

పొరుగుననున్నవాఁడగుట బుద్ధమహీపతితోడి మైత్రికై
వెరవునఁగూడుటెంతయు వివేకముగా మదినెంచి యిందుశే
ఖరుఁడు మెలంగుచుం బనులు గల్గిన వేళల రాకపోకలన్
జరుపుచు నన్నరాధిపునిసఖ్యము ముఖ్యముగా నొనర్చుటన్

మున్నుమువ్వురు తనయింటఁబన్నుకొన్న
వ్యూహ మిందుశేఖరునకు బోధపటిచి
పిన్నచోడుని కూఁతులపెండ్లికతనిఁ
బూన్కిఁగొనితెచ్చె నతవాటిబుద్ధరాజు

ధరణికోట నృపతి యిరుపక్షములయందుఁ
బెత్తనంబుఁబూనఁ బెండ్లిజరిగె
గణపతిప్రభుండు కన్యాద్వయంబును
జెట్టవట్టెఁ బ్రజలు సేసలిడఁగ

నారమ పేరమలను దే
వేరులతోఁ గాకతీయవిభుఁడటఁగృష్ణా
తీరావని సైకతవిత
తారామ సమీరముల విహారము సలిపెన్

మించిన వేడ్కతోఁబడవమీఁద సతీపతులెక్కి వీచికో
దంచితకృష్ణవేణిక విహారమొనర్చిరి గంగఁ దూఁగు రా
యంచలమాడ్కిఁ దీరములయందిరువంకలఁ బల్లెపట్టులం
గాంచుచు నందుఁగల్గు సహకారవనంబుల విశ్రమించుచున్

ఏటిలంకల లేఁత బీటి పచ్చికమేయు
కోడెదూడల మేనికొమరుఁగాంచి
కొమరుఁబోం డ్లదలించి గొంతెత్తి పాడెడి
పల్లెపాటల మేలివలనెఱింగి

వలఁబడ్డమేటి చేఁపలఁబట్టి నావపై
దరులకుఁ జేర్చుజాలరులఁ జూచి

జాలరుల్ గట్టిన పోలికఁ బూగుత్తి
కదుపుల నొప్పు పూఁబొదలవిడిసి

పొదలు చెఱకుఁదోఁటలఁదోఁచు పొలుపులరసి
పొలిచెఁబూముల్కిదొర విండ్లమోపులనుచు
మేలమాడుచు గణపతి మెలఁతజంట
గూడి కృష్ణాతరంగిణిఁగ్రీడసలిపె

స్నానంబాడిరి నూత్నదంపతులు కృష్ణావార్ధివాస్సంగమ
స్థానోల్లోల తరంగపంక్తులఁ, గళత్రద్వంద్వమల్లాడ నా
జానుస్ఫీత భుజాద్వయింగమిచి వక్షఃపీఠముంజేర్చు భూ
జానిన్మెచ్చిరి పూవుఁబోఁడులు పరిష్వంగానుభూతిస్మృతిన్

తొలిసృష్టించెవిధాత లోకమున నీతోయంబుఁగల్పాది, నీ
జలధుల్ మూలము లీచరాచర జగత్సంసారవారాశి, క
వ్వలి తీరంబు నెఱుంగనేరక నరుల్ భ్రాంతిందదూర్మిచ్ఛటా
కులులైజన్మపరంపరంబడుచు సంక్షోభింతు రశ్రాంతమున్

గిరిజావల్లభుఁడష్టమూర్తి పదపంకేజమ్ములంబట్టి సం
సరణాంభోధిఁ దరించుభక్తులు మహాజ్ఞానుల్ పునర్జన్మమున్
మరణంబుంబెడఁబాసి కాంతురు మహానందాత్మకైవల్య, మా
హరునంశంబవు సాగరా! కొనఁగదయ్యా! మన్నమస్కారముల్

అనిదారసహితుఁడై య
గ్గణపతిదేవుండు మొగిచెఁగరము లుదధికిన్
మనమునఁదద్గాంభీర్యముఁ
గొనియాడుచుఁ, దీరభూమి కుతుకమురేఁపన్

వివిధవర్ణశంఖ వితతులు ముత్తెపుఁ
జిప్పలేరికొనిరి చెలులుఁ దాను
నహమహమికతోడ నంభోధియాత్రకుఁ
జెటిగిపోనిస్మృతికిఁ జిహ్నములుగ

తిరిగి నావమీఁదనరుగుచునారేయి
విడిసిరొక్కయూర విశ్రమింప
నచటిజానపదుల యాతిథ్యముంగొని
తెల్లవారఁ బ్రజలనెల్లఁబిలిచి

తన కృతజ్ఞతఁదెలిపి తద్గ్రామమందు
దేవళములేమి గణపతిదేవుఁడరసి
యటఁబ్రతిష్ఠించె నొక్కదేవాలయంబు
నేఁటి గణపేశ్వరంబె యానాఁటిపల్లె

ఊరిపెద్దలెల్లరుత్సాహమునఁగూడి
దీవనల నొసంగఁదిరిగివెడలి
క్రొత్తపెండ్లికొడుకు క్రొయ్యూరుసొత్తెంచె
నెదురు చూచు నాప్తులెల్ల నలర

కొన్ని దినములట్లు క్రొయ్యూరునంబుచ్చి
యేగఁదలఁచెన్నృపతి యేకశిలకు
నంపకంబునలుప నఖిలసంభారంబుఁ
గూడఁగట్టెఁ బిన్నచోడవిభుఁడు

గణపతిదేవువెంటఁదనగాదిలికూఁతుల నంపువేళఁ ద
జ్జనని కవుంగిలించుకొని సారెకు సారెకు బాష్పపూరముల్
కనుఁగవఁగ్రమ్మఁ గంఠమును గద్గదరుద్ధముగాఁగ నెట్టులో
మనమును చిక్కఁబట్టి యొకమాదిరి యెల్గునఁబల్కె నల్లనన్

అనుఁగుఁగూఁతులార! అల్లారుముద్దుగాఁ
గన్నదానఁ బెంచుకొన్నదాన
నిల్లువెడలనంపి యీరీతిగా మీకు
దూరమగుటఁ దలఁపనేరనైతి

ఆఁడుబిడ్డ పుట్టునప్పుడె యొకయయ్య
చేతఁబెట్టురీతి ధాత వ్రాయుఁ
గన్నకడుపుతీపిఁగడకుఁద్రోవఁగలేక
యెఱిఁగియెఱిఁగి దానికిట్లువగతు

కులము గలుగువాఁడు గుణవంతుఁ డగువాఁడు
వల్లభుండు చక్రవర్తి యౌట
వగవనేల మీరు? వలపులఁబండించి
పండ్లవంటి సుతులఁ బడయుఁడమ్మ!

ఒక్కచోటనిల్వ దుర్వీపతులచిత్త
మెచ్చులొచ్చులుండవచ్చుఁబ్రేమ
నీసుఁజెందకుండుఁ డిరువురు మీలోన
సవతులను గనుండు సఖులమాడ్కి

చక్రవర్తియైన సరసుని యంకమ్ము
నెక్కఁగంటి మనుచు నిక్కరాదు
మగఁడు కినిసినపుడు మారుపల్కఁగరాదు
కోర్కెఁదెలుపుఁడతఁడు కోరినపుడె

అంతిపురినిమెలఁగు నింతుల నొకరీతి
నమ్మకుండరాదు నమ్మరాదు
కొండె కత్తియలను గుర్తింపవలెఁ గాని
తిట్టరాదు చెలిమికట్టరాదు

పరిజనంబు తోడఁబరిహాసమెప్పుడు
కేరడంబుదగదు కినుకజనదు
కార్యజాతమెల్లఁ గనుసన్ననడపుట
రాణివాసమునకు రాణఁదెచ్చు

పేదసాదులయెడ విధివంచితుల యెడఁ
గనికరంబుఁజూపఁ గలుగు శుభము
భక్తి వినయములను పాటింపవలెనమ్మ!
పెద్దలందు జ్ఞానవృద్ధులందు

ఏరాండ్రతోడనెప్పుడు
పోరాటము సలుపఁదగదు పొలఁతికి, మగఁడే
రారాజైనను నితరులఁ
గాఱియ పెట్టందలంపు కలుషముఁ గూర్చున్

పుట్టినట్టియింట మెట్టినయింటను
బ్రాఁకుఁ గీర్తివల్లి పడఁతికతన
నుభయవంశములకు నూర్జస్వలంబైన
పెంపుఁగూర్పుఁడనుఁగు బిడ్డలార!

ఇంతవట్టు మీకునెఱుకయుండును గాని
గొప్పవారియింటికోటరంబు
కత్తిమీఁదిసాము కాలసర్పము తోడి
చెలిమిగాన నొత్తిచెప్పవలసె

బెంగవలదు దీర్ఘమాంగల్యమగుఁగాక
పోయిరండు కూర్మిపుత్రులార!
అనుచుఁదిలకమలఁదె నలికభాగమ్ములఁ
బాదములనుగడిగె భామయోర్తు

పడఁతియొకతె పసుపు పారాణి హత్తింపఁ
బిన్నచోడవిభునిబిడ్డలిరువు
రలికములను గురులయడుగులపైమోపి
రశ్రుజలముపాద్యమగుచుఁదొరఁగ

ముచ్చిరుముద్దరాండ్రఁ దనముద్దులకూఁతుల లేవనెత్తి కేల్
గ్రుచ్చికవుంగిలించి కనుఁగోనల నశ్రుజలంబు గ్రమ్మఁగాఁ
దెచ్చిన చోడుఁడా గణపదేవుని చెంగటనిల్పి తోడుగా
నిచ్చెఁగుమారుజాయప ననేకపసంగరరంగికోవిదున్

అనుఁగుఁగుమార్తెలిర్వురపుడందలమెక్కఁగఁ బిన్నచోడుఁడా
గణపతికింగుమారునకు గంధగజమ్ముల నిచ్చిపంపె, నా
వెనుక ననేకయోధపరివేష్టితులై పరిచారికాదులుం
జని రరణంబొసంగిన ప్రశస్తసువస్తుహయాదికంబుతోన్

విజయవాటీతటీకృష్ణవేణిఁగ్రుంకి
కనకదుర్గను మల్లేశుఁగాంచి మ్రొక్కి
విడిదిపట్టులఁబ్రజల దీవెనలఁగొనుచు
నేగె గణపతిదేవుఁడ య్యేకశిలకు

పెండ్లియైన నాఁడె ప్రెగ్గడ సోమన్న
నింగిముట్టినట్లు పొంగిపోయి
గడియనిలువలేక కల్యాణవార్తలఁ
జాటు కొఱకు మున్నువీటికరిగె

గోపురబద్ధపతాకో
త్రేపంబులు నగరలక్ష్మి చేతః ప్రీతిన్
భూపతి నాహ్వానింపం
జాఁపినకరనివహమనఁగఁజదలంగదలెన్

తోరణ కుంభద్వయమవ
ద్వారముభయతః కళత్రవద్గణపతి భూ
స్వారాట్టున కేకశిలా
క్ష్మారమణునకెదుటఁదోఁచె స్వాగతమొసఁగన్

ఆపురసౌధపాళి జలజాక్షులు రూపజితేక్షుచాపు నా
భూపలలాము నవ్విభునిముద్దియలం గనువేళ, వారివాల్
చూపులజల్లులో విరులసోనలొ యవ్వలరాచజోదు క్రొం
దూపులమోపులో వలపుఁదుంపరలో ముసరెన్ నభఃస్థలిన్

బుద్ధిసిద్ధియనెడి యిద్దరు దేవేరు
లిరుకెలంకులందు నేగుదేర
నరుగుదెంచె మనమహాదేవతనయుండు
గణపతికదయాతఁ డనిరిజనులు

ఆపురి ఘంటాపథములు
గోపురములు మేడమిద్దె గోడలు కుజముల్
భూపతి మిథునంబును కను
లాపోవంజూచు జనుల కాశ్రయమయ్యెన్

పంచమహాశబ్దబధిరితాశాపాళి
    తౌర్యత్రికముల మాధుర్యగరిమ
వీరభద్రుల చిత్రవిన్యాసదృశ్యంబు
    మైలారుభటవీరఖేలనంబు
పగటివేసంబుల భాగవతులలీల
    వందిమాగధవచో వైభవంబు
పుణ్యాంగనాక్షిప్త పుష్పాక్షతంబులు
    పణ్యాంగనా నృత్తపాటవంబు

బెరసి కిర్మీరితంబైన పురమునందు
అననుభూతపూర్వంబు దృశ్యంబొకందు
గాంచిపులకించెఁ దత్పౌరగణము క్రొత్త
పెండ్లికొడుకైన ప్రభువేగు వీధులందు

# చతుర్దశ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

ఏకశిలామహానగరి నెక్కడఁజూచిన రాజవీధులం
దాకసమెల్ల క్షౌమవసనాదిమహోర్ధ్వవితానధారియై
కాకతిరాజ్యలక్ష్మి కతిగౌరవచిహ్నమహాతపత్రమై
వాకులఁదెల్పరానియొకవన్నియఁదాల్చె నదృష్టపూర్వమున్

కుందమదేవి పెండ్లి కిరుకోవలనుండియు నాప్తమిత్రులున్
బందుగులాదిగావిడియఁ బట్టణమయ్యెజనార్ణవంబుగా
సందడియయ్యెఁబిల్లలకు సంతసమయ్యెను పెద్దవారికిన్
వందిజనంబుమాగధులుఁ బార్థివవంశయశంబుఁబాడఁగన్

రాజమందిరముల రతనాలు ముత్యాలు
వ్రేలుచుండఁ బెండ్లివిడుదులందు
జలదరహితమైన సౌదామనీరుచుల్
చూపఱకుఁగనంగఁజోద్యమయ్యె

కాకతిప్రభుండు గారాపుఁజెలియలిఁ
గుందమాంబఁ బెండ్లికూఁతుఁజేసి
బుద్ధరాజునసుఁగుఁబుత్రుఁడౌరుద్రుని
తోడజరిపెఁ బాణిపీడనంబు

పెండ్లిముచ్చటల్ దీరినవెనుక రాచ
విందులందిన దూరపువిందులెల్ల
రరిగినంతట, ముఖ్యులౌనవనిపతులు
మంత్రిసేనాను లేకాంతమందిరమునఁ

గొలిచియుండఁగఁడి పెఁ గొంతమంత్రాంగంబు
గణపతిప్రభుండు, కైదువంటి
ప్రతినఁబూనిరెల్లవారు, పేరోలగం
బుదధిరీతిఁబొంగె నుద్ధతముగ

రాజానుమతినిఁగైకొని
యాజానేయాదివాహనారూఢులు త
ద్భూజానులువెడలిరి తమ
ఫౌజులతో ధాన్యకటకపార్థివముఖ్యుల్

కోటకేతరాజు క్రొయ్యూరిపినచోఁడు
డిందుశేఖరుండు ముందుచనఁగ
నరిగెబుద్ధరాజు మఱునాఁడు గణపతి
యంప నూత్నమిథునమనుసరింప

గణపతి సచివాగ్రణిసో
మన సేనాపతినిరుద్రు మఱఁదియయినజా
యనఁ బిలిచిమంత్రగృహమున
ననికనువగువ్యూహముం బ్రయాణముఁదెలిపెన్

కొన్నినాళ్ళు ప్రభువుక్రొత్తయిల్లాండ్రతో
గానసభలతోడఁ గవులతోడ
గణకవరులతోడఁ గాలంబుఁబుచ్చుచు
నుండునంతలోన నొక్కనాఁడు

గణపతి పేరోలగమున
మనవులువినువేళ నొక్కమనుజుండటకుం
జనుదెంచి మ్రొక్కియాగతి
వినిచె సభాసదులకెల్ల వీనులునిక్కన్

దేవరవారికిన్‌జయము! తిన్నఁగనేగియొసంగితిన్ సుహృ
ద్భావపురస్సరంబుగ భవల్లిఖితంబగుపత్రమున్, దశ
గ్రీవునకీడనందగిన కేశవనాయకుఁ డాగ్రహంబుతో
వావిడఁబల్కినట్టివి సభాస్థలినాడఁగనోడెదన్‌ప్రభూ!

మాటలటుండఁ జేఁతలొకమానవనాథునకొప్పునే? ద్విధా
పాటితమైనలేఖఁ దనపాదతలంబునమట్టిపల్కె "మీ
పోటరితేనికిందెలుపఁబొ మ్మిఁకమీఁదటమాకుఁగప్ప మే
టేటనుపంపుచుండవలె నియ్యదితప్పినముప్పమూఁడెడిన్"

అనియామీఁదట నతఁడే
పనికింగొఱగాని తులువపలుకులనాడన్
విననొల్లకనేవెడలితి
మనవారికిఁదెలుపఁదలఁచి మసలకయుచటన్

అనెడిరాచబంటునదలించి విరియాల
భీముఁ డడిదమొఱనువెడలఁదిగిచి
కాలనేలఁదట్టిగర్జింప, గణపతి
యాఁపి యవలఁజెప్పమనియెభటుని

తిరిగిభటుండుపల్కె "నటుదేవరయానతిఁగృష్ణవేణికా
పరిసరభూములన్విడిసి వైరిపురంబునుముట్టడింపఁగా
వెరవులనెంచుచున్న మనప్రెగ్గడసోమనఁగాంచిమ్రొక్కి యం
దఱువినఁ బూసగ్రుచ్చినవిధంబునఁదెల్పితి వైరిచేష్టలన్

దేవా!యేమన? మనస్కం
ధావారము లయజలధివిధంబునఁబొంగెన్
ద్యావాపృథివీమధ్య
స్థావరణముఁగ్రమ్ముకొనె మహాశబ్దంబుల్

పిన్నచోడవిభుఁడు ప్రెగ్గడసోమన్న
దండిజోదురుద్రదండనాథుఁ
డుద్యమించినడప నుర్విక్రక్కదలంగఁ
★ గొలనిపురముదెసకుబలమునడిచె

నిదురప్రోలికొకని మడపల్లెకొక్కని
నాశ్వికులను వార్తలందఁజేయఁ
బుచ్చెసోమమంత్రి ముమ్మోలముట్టడి
కొలనివీటిమీఁదఁజలుపనెంచి

★ నేఁటి యేలూరికి నాఁటి సాహిత్యమున కొలనిపురము, కొలనువీడు, సారసపురము, హేలాపురము అను పేళ్ళు గలవు

సైన్యచలనమెఱిఁగి పారసపురపతి
పెండ్లియైనవెనుకవేడ్కలనుచుఁ
దలఁచుచుండెఁగాని తనకొంపముంచెడి
యెత్తికోలటంచునెఱుఁగడయ్యె

రెండవనాఁడు పారసపురిన్ నలువైపులముట్టడించె వే
దండతురంగసంగతపదాతిదళంబులు సోమమంత్రి రు
ద్రుండును నిందుశేఖరుఁడు దోర్బలభీముఁడుబుద్ధరాజు చో
ళుండును జాయపప్రముఖులుం బురికొల్పుచు నెచ్చరింపఁగన్

పంచమహాశబ్దంబుల
సంచాలితమగుచునుండ పారసపురి ధై
ర్యాంచితకేశవనాయఁడు
కొంచక సైన్యంబుఁగోటగోడలనిలిపెన్

గండాభోగమదభ్రమద్భ్రమరశృంగారాభిరామోగ్రమౌ
శుండాలంబును దుర్గగోపురపుఁగంచుందల్పులంగూల్ప ను
ఛ్చండాటోపముఁజూపిడీకొలుపుచో జాయప్పఁజూడందగున్
కొండాడందగుసుందరాంగుఁడు మహోగ్రుండౌరణాగ్రంబునన్

చిటపటఁగామునిఁగాల్చిన
నటరాజనిటాలభాగ నయనముభంగిన్
త్రుటికాలంబునఁ గేశవు
పుటమార్పం గోటగవను పుటపుటవ్రీలెన్

ఆతరువాత సోమనయునాగజమెక్కఁగ రుద్రుఁడాశ్విక
వ్రాతము బుద్ధభూపతి ద్విపప్రకరంబును పిన్నచోడభూ
నేతయు నిందుశేఖరుఁడనీకినులన్ పురికొల్పియుద్ధతిన్
భూతలమెల్లఁగ్రక్కదలఁ బ్రోలుచొరంబడిరొక్కపెట్టునన్

గిజగిజలాడుచున్ వెడలి కేశవనాయకుఁడీవలావలన్
గజబలమేగుదేర నొకగంధకరీంద్రమునెక్కి యాజి ౯ఁ
భుజబలదర్పముల్ వెలయఁబోరఁగడంగెఁ దదీయ సైన్యమున్
విజయమొస్వర్గమోయనుచు విక్రమశౌర్యములొడ్డిసిల్వఁగన్

జాయపమావటీఁడయిగజంబునదల్పఁగ సోమమంత్రి తీ
క్ష్ణాయితఖడ్గహస్తుఁడయి గ్రక్కనఁగేశవుఁడున్నహస్తిపై
నోయనదూఁకి వానితలనుర్విఁబడందెగనేసియార్చినం
బాయలుపాయలైవిఱిగి పాఱెఁదదీయబలంబులుక్కఱన్

"ఏలినవారిసన్నిధికినేగి వచింపుముపూసఁగ్రుచ్చిన
ట్లాలముతీరు దేవరజయం" బనిసోమనమంత్రియంప మీ
పాలికివచ్చితిన్ దొలుతవార్తలఁదెల్పఁ నమాత్యముఖ్యులా
ప్రోలువశంబొనర్చుకొనుపూనిక నప్పురమందెనిల్వఁగన్

లసియతఁడుప్రమొక్కితొలఁగఁగ
గణపతిభూనాథుఁ డోరుగల్ తలవరి మా
చనఁబిలిచి జయముఁజాటం
బనిచెన్ నల్గడలయందుఁబట్టణసీమన్

కొన్నిదినాలకుం గొలనికోటజయించినయిందులూరి సో
మన్నయు రుద్రముఖ్యులుసమాగతులై పురినిందుకొల్వులో
నున్ననృపాలుఁగాంచి తమయుద్ధముసాగినరీతిఁదెల్పఁగా
నన్నరనాథుఁ డప్పురమునందొనగూర్చె జయోత్సవంబులన్

ఆమనుజేశ్వరుండు విజయంబుఁగడుంగడుఁబ్రస్తుతించి "యీ
సోమన నేఁటితోఁగొలనిసోమనగానుతులందుఁగాత ము
ద్దామబలాఢ్యుఁగేశవు నితండువధించినరీతిఁజూడఁగా
రాముఁడొభీముఁడో పరుశురాముఁడొకావలె మంత్రిమాత్రుఁడే

రుద్రుఁడుతక్కువేమిటొ? విరోధిశిరోధులబంతులాడ ని
ర్ణిద్రుఁడువీరభద్రుఁడె యనీకినిముంగడనేగుదెంచుచో
నద్రిసుతాతనూజుఁడు షడాననుఁడోయనఁగానవచ్చుఁ ద
ద్రౌద్రరసాకృతింగని యరాతులుకాతరులౌచుఁబాఱరే?"

అనియీరీతిందక్కిన
జననాథుల యోధవీరసైన్యపతుల నా
గణపతిదేవుఁడు మెచ్చుచు
ఘనతరసన్మానములను కాన్కలొసంగెన్

# పంచదశ తరంగము

యార్లగడ్డ వెంకట సుబ్బారావు

కతిపయమాసముల్ గడవఁ గాకతినాథుఁడు కొల్వు సేయఁగా
నితరమహీతలాధిపుల యింగితమెల్లనెఱింగినట్టి య
మ్మతిమదమాత్యుఁ డాప్రకృతిమండలముంబరికించి యమ్మహీ
పతికినమస్కరించి యిటుపల్కె గభీరవచఃక్రమంబునన్

అక్కడనక్కడంగలుగునల్పమహీపతు లాంధ్రభూతల
మ్మొక్కనృపాలునేలుబడినుంటయె మేలనిసమ్మతింపఁగా
రక్కెసగంగసాహిణి పరాక్రమశాలివచించినాఁడు "నా
ముక్కునవాయియుండ నెటుమ్రొక్కుదు? యాదవనాథుబందికిన్"

అనురీతిగ నవియివి
వినఁజవిగానట్టివెన్నొ వెంగలిపలుకుల్
విననొల్లక వెనుదిరిగితి
మనుజాధిప! వానిఁగిట్టి మదమణఁపవలెన్

వెలనాటి రాజ్యవైభవ
మల పృధ్వీశ్వరునిఁ గూర్చి యంతమొనర్చెన్
చలపాదితిక్కచోడుఁడు;
బలియుఁడతఁడు పాకనాటిప్రభువైయుండన్

ఆరాజన్యుని పడవా
లై రక్కసగంగఁడుండి యావిభు వెనుకన్
వీరమన్యుండీతం
డేరాజై పుష్పగిరి మహీతలమేలున్

ఆపాకనాటినేలెడి
భూపాలుఁడు మనుమసిద్ధి పోటరి కామిన్
యీపాలసునౌద్ధత్యము
నేపడఁ పంజాలకుంట నెల్లిదమయ్యెన్

ఏకువలెఁజొచ్చి పిమ్మట
మేకై హృదయాంతరమున మెఱమెదువారల్
వాకునఁజక్కంబడుదురె?
బాఁకునఁదీర్పంగవలయు బాలిశజనులన్

అని మంత్రివరుఁడు వలుకన్
గణపతిదేవుండు కన్నుఁగవయెఱ్ఱెక్కన్
మనుమీసలు నోష్ఠంబులు
వణకంగాఁ గిటములదరఁ బలికెం గినుకన్

చెట్టులేనియూరఁ జిట్టాముదపుఁజెట్టు
కల్పవృక్షమట్లుఁ గానవచ్చు
రాజులేనిసీమ రక్కసగంగఁడే
రాజు రాజరాజు భోజరాజు

నరముమీఁదిౘ్రణము నడుమంతరపుసిరి
సలుపుఁదీపుఁ దెలుపనలవికాదు
తులువగద్దెనెక్కఁ దూరుపుఁబడమర
కానరావు నెత్తిఁగన్నులుంట

ౘ్రేటునోర్వవచ్చు మాటనోర్వఁగరాదు
తులువఁబట్టి నాల్కఁద్రుంపవలయు
ముట్టడింపవలయుఁ బుష్పగిరిన్‌వేగ
నాప్తతతికి వార్తలంపవలయు

కోటకేతరాజు గుంటూరినాగిన్న
చిన్నచోడుఁ డిందుశేఖరుండు
బుద్ధరాజు మొదలు భూనాయకులకెల్ల
వార్తలంపు సచివవర్య! వేగ

అనుచుఁగొలువువీడె గణపతిదేవుండు
మ్రొక్కియరిగినారు తక్కుజనులు
మాచనాయకుండు రేచర్లరుద్రుండు
వెడలినారు సోమప్రెగడఁగూడి

కోటకేతరాజు గొల్లెనలెత్తించె
సేనవిడియఁ గృష్ణవేణికెలనఁ
గూడలిగఁదలంచి గురిజాలదాపున,
సేనలెల్ల నటకుఁజేరినంత

ముందుఁబదాతిసైన్యములుపోవఁగ వానిపిఱుందదంతిరాట్
బృందముసాగనంపి యటుపిమ్మటనాశ్వికసైన్యయుక్తులై
యందఱుఁగూడి పుష్పగిరియంతికసీమకుఁజేర , భేరులున్
చిందములాదిగామొరసెఁ జించెదునోయన దిక్తటంబులన్

సచివుసోము నగరసంరక్షణకునిల్పి
చక్రవర్తి రుద్రజాయపలను
వాహినీపతులుగఁ బయనంబుఁగావించి
తానువెడలెననికి సేనవెంట

రక్కసగంగఁడప్పటి కరాతులపూన్కితెఱంగెఱింగి నల్
దిక్కుల దుర్గరక్షణ కుదీర్ణపరాక్రమధైర్యసారు లు
క్కెక్కిన జోదులన్నిలిపి యించుకయేమఱకుండఁ బుచ్ఛముం
ద్రొక్కినకోడెత్రాఁచువలె రోఁజుచుదుర్గమునందుఁగ్రుమ్మరెన్

కటకముచెంగటన్విడిసి కాకతినాధునవుజ్ఞనంది యా
ర్భటులుసెలంగ గోపురకవాటము జాయప దంతితాఁపులం
బెటపెటఁగూల్చఁగా నడరివీరశిరోమణిరుద్రుఁ డుద్ధతిం
జటులతురంగసాదియయి సైన్యముతోఁబురముంజొరంబడెన్

రక్కసగంగఁడుత్తమతురంగమునెక్కి యెదిర్చెరుద్రునిన్
తెక్కలుమొల్చినట్లనిఁజరించుచుఁ ; దద్విధమెల్లఁగాంచి యా
ప్రక్కకువేగి యొక్కయురిత్రాడు గళంబుఁదగుల్కొనంగ దాఁ
గ్రక్కునవైచి జాయప యరాతినినేలఁబడంగనీడ్చెనన్

గ్రక్కున రుద్రుఁడాతని యురఃస్థలిఁబాదముమోపి యుక్కుటన్
ద్రొక్కి కరద్వయిన్విఱిచి తొల్లిటివాగురఁగట్టి "యోరి! నీ
ముక్కుననావియుండఁగనె మ్రొక్కుముయాదవనాథుబందికిన్
రక్కసగంగ! నిన్కనికరంబునఁగావఁగనోపునాతఁడే ||

అని వానింబడనీడ్చుచు
గణపతిభూపాలుపదయుగంబునఁద్రోవన్
జననాథుండాబందిం
గని యనెఁజిఱునగవుతనమొగంబునఁదోఁపన్

ఓహో! రక్కసగంగయ
సాహిణులా! మిమ్ముఁజూడసంతసమయ్యెన్
ద్రోహంబునీకొనర్పఁగ
నూహయొకండేని నెడఁదనొదవదునాకున్

నీవుదక్క నొకనినీయిచ్చవచ్చిన
వాని నిచటరాజ్యపాలనమున
నిలిపిపోవఁదలఁతు నిక్కమునమ్ము మీ
పలుకుఁదప్ప వెంతపగఱవైన

రౌద్రముదుఁగవయ్య రుద్రచమూనాథ
కనికరమునవీనికట్లువిప్పి
యరసితెల్పు మితనియంతరంగంబేమొ
యనుచువానినంపె నవ్విభుండు

అక్కడఁగోటంజొచ్చిన
తక్కినపడవాళ్ళు నితరధాత్రీపతులున్
ముక్కిడిమూఁకలఁదఱుముచు
బొక్కసములఁగొల్లగొనిరి భూరిధనంబుల్

రాజ్యపాలనమున రక్కెసగంగని
యభిమతమున మేనయల్లురైన
యంబదేవుఁద్రిపురాంతకదేవుని
నిలిపి కాకతీయనేతయరిగె

ఏకశిలాపురంబునకు నీవిజయంబునుదెల్ప నొక్కజం
ఘాకరికున్ సమీరణసఖంబగునశ్వమునిచ్చిపంపి యా
కాకతిసార్వభౌముఁడు జగన్నుతవిక్రమశాలి యాశ్వికా
నీకినిఁగూడియేగె సరణిన్ సతులీఁగపురంపుటారతుల్

రాజులకుంబ్రియంబులు శరన్నవరాత్రము లాయుధాలకుం
బూజులు సల్పుపద్ధతులు పూర్వమునుండియుసాగుచుండు నా
యోజనెయోరుగల్లురి మహోత్సవముల్ మొదలయ్యె వీరనీ
రాజనమిచ్చిమెచ్చిరి పురంధ్రులు కాకతిసార్వభౌమునిన్

పిల్లజోదులపుడు విల్లమ్ములందాల్చి
కోఁతిబొమ్మలొక్కచేతఁబట్టి
వివిధచిత్రవర్ణవేషముల్ కైసేసి
పాడఁదొడఁగిరిట్లు ప్రభువునెదుట

శ్రీ మన్మహాదేవచిరతపోలబ్ధ!
అధిగతాసితరమహాపంచశబ్ద!
కాకతీయాన్వయకలశాబ్ధిచంద్ర!
శరణాగతారిరక్షణదయాసాంద్ర!

సత్యభాషాహరిశ్చంద్రరాజేంద్ర!
వివిధసంపన్మహావిభవదేవేంద్ర!

కామినీజనపంచబాణావతార!
ప్రత్యక్షశాంభవప్రమదావతార!

రణచండదోర్దండ! రాజమార్తాండ!
శాత్రవగజసింహ! పలమర్తిగండ!

ధైర్యహేమాహార్య! దానరాధేయ!
సమరాగ్రకౌంతేయ! శౌచగాంగేయ!

కవిపండితప్రజాకల్పావనీజ!
కదనరంగస్థలీకల్పాగ్నితేజ!

ఔదార్యసుగుణసాహసవిక్రమార్క!
కదనాగ్రజయరమాకౌతుకోదర్క!

ధర్మైకదీక్ష! సప్తమచక్రవర్తి!
ఆదిరాజన్యమార్గైకానువర్తి!
పార్థివోత్తమ! గణపతిచక్రవర్తి!
వితతావనీతలవిఖ్యాతకీర్తి!

కాకతియిలువేల్పుకరుణార్ద్రదృష్టి
ఏకవీరాకృపాహేవాకపుష్టి

శ్రీస్వయంభూదేవచిన్మహాశక్తి
స్థిరపౌరజననిత్యసేవానురక్తి

సంతతాభ్యున్నతుల్ జయమిచ్చునీకు
ఏవేళనీరాజ్యహితమెంచిసాకు

నిలుచుఁబరాశక్తినీఖడ్గమందుఁ
బొలుచుమహాశక్తిభుజయుగ్మమందు

బాలురదీవనల్ బ్రహ్మదీవనలు
అగునీకుబ్రహ్మాయురారోగ్యకములు

ఆశాంతపర్యంతమాంధ్రపతాక
అంబరాంచలసీమ నాడునుగాక!